P—552—7-7-66—10,000

# ప్ర[illegible]ము

[ పరిశోధక నవల ]

కొమరవోలు నాగభూషణరావు

[illegible]

సాహిత్యలతా గ్రంథమాల

గుంటూరు

సాహిత్యలతా గ్రంథమాల

ప్రథమ ముద్రణ, జూన్ '53

వెల : రెండు రూపాయలు

సంపాదకురాలు :

శ్రీమతి మద్దినేని అమృతాదేవి

శాస్త్రిశ్రీ ప్రెస్,

గుంటూరు

# "ప్రతారణము

## ౧

## కోటీశ తనయ

సాయంసమయ సంధ్యారాగప్రదీప్తులు రాజగిరి దుర్గ ప్రధాన మందిరములోనికిఁ బ్రసరించుచుఁ దదంతర ప్రతిష్ఠితములైన బహువిధానర్ఘవస్తుసముదాయమునకు వినూత్న శోభ నొడగూర్చుచుండెను. నానావిధ తైలవర్ణ కల్పితములగు చిత్రపటములును నీలపీతాది శ్రేష్ఠవర్ణభూయిష్ఠములగు నాస్తరణములును, నయన సుభగమగు నాసువర్ణకాంతిచే సముజ్జ్వలితములై దుర్నిరీక్ష్యముగ దేజరిల్లుచుండెను. ఆ మందిరము విశాలగవాక్షమున కెదురుగ పశ్చిమదిశాభిముఖియై యుపవేష్టించిన ఒక బాలిక మాత్రమావస్తువులన్నింటి కన్న మిన్నయై అత్యంత శోభావంతముగ మెరసిపోవుచుండెను.

ఆమె సౌందర్యము నవ్యవికసితకుసుమసదృశమై యలరారు చుండెను. ఆమె శరీరకాంతి సువర్ణచ్ఛాయ ననుగమించుచుండెను. ఆమె సర్వాంగములును తీర్చిదిద్దినట్లు మోహనకరములై యొప్పుచుండెను. ఆమె కపోల యుగళి మసృణములై సూక్ష్మారుణరాగరంజితములై మనోహరములై యుండెను. సుదీర్ఘమును, సమున్నతమునగు నాసిక, కోమల మధుర బింబాధరము, ఇందీవరదళసన్నిభ విశాలవిస్ఫురన్నయన ప్రసారిత విలోల దృగ్జాలము, నీలాలక పరివృత లలాటఫలకము ఆమె కమనీయ గాత్రమున కమాల్యభూషణములై ఆమెను మహోత్కృష్ట శోభాసమన్వితగా జేసివైచుచుండెను.

ఆమె యొక యాసనము నధివసించి బల్లపై నున్న శుభలేఖల నందుకొని వానిపై విలాసములను వ్రాయ దొడఁగెను. వ్రాయుటకు విసుగు దోఁచినప్పుడెల్ల నామె నిట్టూర్పులు బుచ్చుచు నావాతాయనద్వారమున దన శూన్యదృష్టుల నుద్యాన వనమువైపునకుఁ బఱపుచుండెను. ఆమె అప్పటి ముఖలక్షణములు దైన్యమును విచారమును సువ్యక్తము సేయుచుండెను.

తన యజమాని కూఁతురగు జయంతశ్రీ మఱి యిద్దరు సఖీల కలసి వనవిహారము సేయుచుండుట ఆమెకు గొంతవడికి గోచరి. వారిని జూడఁగనే యామె విచారభార ముత్కటమైపోయెను. క్రీడాసమయ మగు నాతరుణమున దాస్యశృంఖలా బద్ధయై పాటుబడు మండవలసినంతటి తన దుస్థితినిగూర్చి తలఁచుకొనినంతనే ఆమె నేత్రములు బాష్పధారా ప్రపూరితములైపోయెను.

అట్టియెడ నొక కంఠరవమామెను వెలుపలనుండి బిలచుచుండుట వినం బడియెను.

"సుమబాలా!" అని

"అమ్మా! వచ్చుచున్నాను" అని యాబాలిక ప్రత్యుత్తరమొసంగెను.

"ఫలాహారము-ముగ్గురకు ఫలాహారమును వేగముగఁ దెప్పింపుము" అని యాకంఠరవ మొక్కింత పరుషముగ నాజ్ఞాపించెను.

"చిత్తము" అని యాబాలికలేచి పాకశాలలోనికి బయలువెడలెను. ఆమె యామందిర మధ్యభాగమునందుగల బల్లపై నమర్పబడిన పుష్పకుండిక లోని గుచ్ఛములు చెదరిపోవుటగాంచి వానిని యలంకార ప్రాయముగ సవ రించుచు నొక సేవకుని బిలచెను. వాడు వెంటనే ఆమె సమీపమునకు వచ్చి నిలువబడెను.

"వేణూ! ఫలాహారములను దెప్పింపుము."

"ఎందఱకు?"

"ప్రస్తుతము ముగ్గురకు, యజమాని వచ్చినచో నలుగురకు –"

"అతఁడిపుడు రాడు. వేఱొకచో విందారగింపఁ బోయినాడు. ఆతడు వచ్చుటకు నింక చాలా వ్యవధి యుండఁగలదు."

"మఱి-దుర్గాధ్యక్షుఁడగు తుషారకాంతరాయలు? ఆతఁడింకను స్వారి నుండి తిరిగిరాలేదు-వచ్చినాఁడా?

"ఇంకను రాలేదు" అని వేణు వెడలిపోనుద్యుక్తుఁ డయ్యెను.

"ఒకమాట - నగర ప్రయాణమునకు సర్వసన్నాహములును ముగిసి నవా? మీరు త్వరగా బయలుదేఱవలసి యున్నది. తక్కిన పరివారమును సిద్ధముగా నున్నారా?" అని సుమబాల యొక్కింత యాతురతఁ జూపుచుఁ బ్రశ్నించెను.

"అందఱును సిద్ధముగానే ఉన్నారు".

"అట్లయిన నీవు త్వరగాఁబోయి ఫలాహారములను బంపుము"

వేణు పాకశాలలోనికిఁ బోయెను. సుమబాల తన బల్లకడకు తిరిగి వచ్చెను. ఆమె లేఖినిని జేపట్టక ఆ శుభలేఖలలో నొకదాని నందుకొని తనలో నిమ్మళముగా జదువుకొనఁ దొడఁగెను. అందిట్లున్నది.

## ఆ హ్వా న ప త్రి క

నా కుమార్తెయగు జయంతశ్రీకని, రాజగిరి దుర్గాధ్యక్షుఁడగు శ్రీకుమార కాంతరాయలకును జరుగబోవు పాణిగ్రహణ మహోత్సవమునకు మిమ్ములను వినయపూర్వకముగా ఆహ్వానించుచున్నాను.

శ్రీ శ్రీ శ్రీ క్షితీంద్రనాథుఁడు.

ఆమె యాపత్రికను పలుమాఱులట్లే పరధ్యానముచేఁ జదువుకొనుచు నించుక ప్రమత్తయయ్యెను. ఆ తరుణముననే "సుమబాలా! ఏమి చేయుచున్నావు? శుభలేఖలపై విలాసములు వ్రాయుట పూర్తియైనదా? "అని పరుషస్వరమున బలుకుచు "టెన్నిసుబ్యాటు"ను జేతఁబట్టుకొని సగర్వముగా జయంతశ్రీ లోనికి వచ్చెను.

ఆమె అందవిహీనయని చెప్పుటకు వీలులేదు. ధనమే సౌందర్యము సమకూర్ప జాలులేని అట్టి సౌందర్యమామెకు చేకూరియే యున్నది. కోటీశు తనయయై కోట్లకధికారిణి గాబోవుచున్న యామెకేయందమును కొఱవడి యుండదు. కాని ఆమె స్వభావములో మార్దవములేదు. ఆమె పలుకులలో మంజుల స్వనములులేవు. ఆమె దృష్టులలో శరత్కాల జ్యోత్స్నలులేవు. ఆమె హాసములో ప్రాగరుణ కాంతులులేవు. ఆమెలో గర్వమును ఆడంబరమును మూర్తీభవించి యుండెను. ఇరువురను సరిపోల్చి చూచినచో- సుమబాల ఒకదేవత – జయంతశ్రీ ఒక సామాన్య స్త్రీ.

జయంతశ్రీతో బాటు చెలికత్తెలిరువురును లోనికివచ్చి సుమబాల బల్లపై మూఁగిరి. వారిలో నొకతె శుభలేఖలబొత్తి నందుకొని "ఇవి యన్నియు శుభలేఖలేనా?" యని ప్రశ్నించెను.

"అవును అప్పుడే ఏమైనవి? ఇట్టిబొత్తులింకను పదిపోవలసి యున్నవి" అని జయంతశ్రీ బదులు పలికెను.

"ఓహో! మీకు వేలకొలఁది స్నేహితులున్నట్లున్నారు!"

"అవును! వారముదినముల క్రిందట నాకు కాబోవు వదినెగారు నా గౌరవార్థము ఒకపెద్దవిందు చేసి నన్నందులకో ఎఱుకపఱచినది. వారందఱు వివాహమునకు రావలసినవారే గదా!"

"నీవు రాణీసాహేబా వైనపుడు మేము నీస్నేహమున కెంతమాత్రము తగియుండము."

"ఆ! అదేమిమాట" యని జయంతిశ్రీ ఒక శుభలేఖ నందుకొని "సుమబాలా దీనిపై - భద్రిరాజేశ్వరీదేవి - 24, ధర్మశాలవీధి అని వ్రాయుము" యనుచు నామె చేతి కందిచ్చెను.

"సుమబాలా! కొంచెమాగుము. ఈమె శ్రీ తుషారకాంత రాయలు మేనత్త. సనాతన ధర్మపరాయణ. పరమాస్తికురాలు. ఈమెను విందునకాహ్వానించ వచ్చునా?"

"ఆసంగతి శ్రీ తుషారకాంతునితో యోజించుట మంచిది."

"అయ్యో! ఈవిషయము లాతఁడు లెక్క సేయడు. కడచిన ఏడు సంవత్సరములలో నాతఁడు పూర్ణముగ మాఱిపోయినాఁడు. ఆతఁడు దక్షిణ దేశయాత్రికు వెడలకపూర్వము అన్నివిషయములలో నధికోత్సాహమును గనబఱచెడివాఁడు."

"మఱి నేఁడో"

"అబ్బే! అప్పటి చుఱుకుదనములేదు. ఇప్పుడు ఆతనిలో గొంచెము మాంద్యము ప్రవేశించినది."

వేణు ఫలాహారములను దీసికొనివచ్చెను. అందఱును దినదొడఁగిరి. జయంతశ్రీ ఒకచోటకూర్చుండక యటునిటు పచారుచేయుచుండెను. అట్లుతిరుగుచు నామె తటాలున నాగిపోయి "పియానో" పైనున్న ఒక రజతసాలభంజికను జూపుచు "ఇది యిక్కడి కెట్లువచ్చినది?" అని ఆశ్చర్యసూచకముగాఁ బ్రశ్నించెను.

"మనము లోనికివచ్చినప్పుడు అది ఆ అలమారపై దాని యథాస్థానములో నేయుండెను." అని సుమబాల పలికెను.

"వేణూ! మేము తోఁటలోనున్నపుడు నీవీ మందిరములోనికి వచ్చితివా?" అని జయంతశ్రీ యాసేవకుని ప్రశ్నించెను.

"లేదుతల్లీ!" యని వాఁడు ప్రత్యుత్తర మొసంగెను.

"మఱి-ఎవరో ఒకరు వచ్చియుండవలెను."

"నేనెవ్వరిని జూడలేదు."

"ఇది చాలా చిత్రముగానున్నది."

"అవును. విగ్రహములు స్వయముగా కదలఁజాలవుగదా!"

అందఱు నావిగ్రహమువంక తదేకదృష్టితో జూడసాగిరి. అది మఱల తమ కనులముందఱనే కదలునని వారెంచుచుండిరి. వేణు దానినితీసి స్వస్థానమునందుఁ జేర్చి వెడలిపోయెను.

ఫలాహారానంతరము వారు వివాహమునకు వలయు నలంకరణములను గూర్చియు, భూషణవస్త్రాదికమునుగూర్చియు ముచ్చటించుకొనసాగిరి. అప్పటికే జయంతశ్రీకి ప్రతిదినము నలుమూలలనుండి వివిధములగు బహుమానములు వచ్చిపడుచుండెను. ఆదినము వచ్చిన బహుమతులలో ఒక ముత్యాల హారముండెను. ఆమెతండ్రి స్నేహితులలో నొకరు దానిని పంపియుండిరి.

"మా నాయనగారిస్నేహితులు విలువగల బహుమానములు పంపుచున్నారు. మా అత్తగారివైపు బంధువులుమాత్రము దువ్వెనలతో సరిపుచ్చుకొనుచున్నారు" అని జయంతశ్రీ హేళనగానవ్వెను.

"శ్రీ తుషారకాంతరాయలను ప్రచారమునకు బంపుము. ఆయన బందుగులందరితోఁజెప్పి నీకు విలువగలబహుమానములు బంపునట్లు చేయును." అని ఒక చెలికత్తె పరిహాసోక్తులాడెను.

"మీకు తుషారకాంతునితోఁ బరిచయ మెట్లుకలిగినది?"యని మఱొక చెలికత్తె ప్రశ్నించెను.

"ఈదుర్గములోనే ప్రథమ పరిచయముకలిగినది."

"నిజముగానా!"

"నిజముగానే యిక్కడకలిగినది. పితృమరణానంతరము శ్రీ తుషారకాంతరాయలు ఆర్థికముగ దుస్థితిలోనికివచ్చెను. ఆతఁడు దక్షిణదేశమునకు యాత్రాసన్నద్ధుఁడై ఈదుర్గమును విక్రయింప బూనుకొనెను. అప్పుడే మాకు చారిత్రకప్రసిద్ధిగల ఒక దుర్గములో నివసింపవలెనని కోరికగలిగినది. మా తండ్రిగారికి కీళ్లవాతమును అప్పుడే సంక్రమించినది. పర్యవసాన మేమనగా మేమిందే నిలచిపోయితిమి. నేనిపుడు దుర్గాధ్యక్షురాలను గాఁబోవుచున్నాను."

"మీ తండ్రిగారి కీళ్లవాతమునకు దీనికి సంబంధమేమి?"

"మా తండ్రిగారట్లు వ్యాధిగ్రస్తులగుటచే శ్రీ తుషార కాంతరాయలు మమ్ములను వారి అతిథులుగా మూఁడు నెలలు సత్కరించి సర్వోపచారములు చేయించిరి. దైవకృపచే చెప్పినట్లు మా నాయనగారి వ్యాధి నిమ్మళించినది. మేమెంతయు ప్రేమించుకొంటిమి. మా నాయనగారు మున్ముందు దీనికొనుటకు సమ్మతించిరి. నేను శ్రీరాయలను వివాహమాడఁగోరితిని."

"అప్పుడు నీకు బొత్తుగా చిన్నవయస్సు కాదా?"

"అయిననేమి? నా బాధ్యతలను గుణముతెలిసియేయుంటిని. శ్రీ తుషార కాంతుఁడు దక్షిణయాత్రకు బయలుదేడలెను. అతఁడు తిరిగివచ్చినతరువాతనే వివాహమాడుటకు నిశ్చయించుకొంటిని."

"ఇప్పుడు మాత్ర మేమి మించిపోయినది?"

"కాని-రామేశ్వరములో ఆయనకు విపరీతమైన జబ్బుచేసినది. అంతటి జబ్బులోగూడ సింహాళము జేరవలెనని పట్టుబట్టినాఁడు. ఆయన సమాచారమే తెలియలేదు. ఒక ఆరుమాసముల పర్యంతము ఆయన చనిపోయినాఁడనియే భావించితిమి."

"అయ్యో! ఎంత కష్టపుదినములు!"

"ఎట్లో గడిచిపోయినవి. అదృష్టవశాత్తు-మరల ఉత్తరములు రాఁదొడఁగినవి. మూఁడు నెలలక్రిందట ఆయన వచ్చుచున్నాఁడని తంతివచ్చెను. ఆప్రకారముగానే ఆయన దక్షిణయాత్రముగించుకొని గృహోన్ముఖుఁడైనాఁడు."

"ఏడేండ్లు నిరీక్షణ-ఒక సామాన్యకార్యము కాదు. నీదీక్ష ప్రశంసనీయము."

"ఒక దుర్గాధ్యక్షుని జేపట్టుటకు ఈమాత్రము ఓపిక ఉండవలదా?" అని రెండవచెలికత్తె సమాధానపఱచెను.

ఏడుగంటలయ్యెను. ఆ చెలికత్తెలిరువురును జయంతశ్రీకడ సెలవు దీసికొని వెడలిపోయిరి. వారు వెడలిపోవఁగనే ఆమె సుమబాలనుపిలచి "చూచితివా ? ఈస్నేహితురాండ్రు నను జూచి అసూయచే దగ్ధమగుచున్నారు" అనియెను.

౨

# సుజీవరుల ఆగమనము

సుమబాల మరల తన వ్రాతబల్లకడకుఁబోయి శుభలేఖలపై విలాసములు వ్రాయఁగడఁగెను. జయంతశ్రీ యామందిరమంతయుఁ గలయఁదిరుగుచు నందుగల వస్తువులను సవరించుచు మధ్యమధ్య తాను చేసిన సవరణలను గుఱించి యనవసర ప్రశ్నములను వేయుచుండెను. ఆమె మాసపత్రిక నొకదానినిదీసికొని చదువుటకై వాలుకుర్చీలో మేనువాల్చి ఏచిత్రపటమును సరిచేయుటకో తటాలున లేచిపోవుచుండెను. ఆమెచర్య మనశ్శాంతిని సూచించుటలేదు. క్రమశః శుభలేఖలసంఖ్య పెరిగిపోవుచుండెను.

ఇంతలో ద్వారము దెఱచికొని వేణు ప్రవేశించెను.

"ఇద్దరు పెద్దమనుష్యులు నిన్నుజూచుటకు వచ్చినారు" అని జయంతశ్రీ నుద్దేశించి వాఁడు విన్నవించెను.

"ఓహో! గిరిధరసోదరులేమో"

"అమ్మా! వారి నామధేయములను దెలుపలేదు."

"ఒకఁ మధ్యవయస్కుఁడు-మఱొకఁడు యువకుఁడు. వారేనా?"

"అవును."

"సరే! లోనికి రమ్మనిచెప్పుము"

"చిత్తము. నగరములో రాజామాయకి చెప్పవలసిన సమాచారము లేవేనిగలవా?"

"ఏవియునులేవు. మీరు బయలుదేరుచున్నారా?"

"అవును. మేమందఱము ఎనిమిదిగంటలబండికిఁ బ్రయాణము."

"సామానంతయుఁ బెట్టెలలో భద్రపఱచినారా?"

"సర్వము సిద్ధముచేయబడినది. బరువుపెట్టెలన్నియు నీవఱకే బండిమీద స్టేషనుకు బోయినవి."

"మంచిది. వారిని లోనికిఁబంపుము." అని జయంతశ్రీ గవాక్షముకడనున్న ఒక కుర్చీపై సవిలాసముగగూర్చుండి యాగంతుకుల రాక కెదురు చూచుచుండెను. ఆమె విలాసమయ భంగిమలో కుర్చీనానుకొని మెడ పైకె

త్రిప్పినప్పుడు ఆమె దృష్టులు గవాక్షమువంక ప్రసరించెను. తోడనే ఆమె నేత్రములు విప్పారెను.

"సుమబాలా! అదియేమి?" అని ఆమె గవాక్షమువంక చూపుచుఁ బ్రశ్నించెను. అచంచలములగు దృష్టులతో నామె యట్లే నిలువఁబడిపోయెను.

"ఏమున్నది?" అని తలవాల్చుకొని వ్రాయుచునే సుమబాల పలికెను.

"ఇదిగో! ఈగవాక్షమును జూడుము. దీని యద్దమొకటి సాంతముగ దీసివేయబడినది."

"అవును. సరిగా గడియవేయుచోట అద్దము కోయబడినది." ఆశ్చర్యముతో వారిరువురును దానివంక జూచుచుండిరి.

"నీ వింతకుఁబూర్వము దీనిని జూచియుండలేదా?" యని జయంతశ్రీ సుమబాలనుగూర్చి ప్రశ్నించెను.

"లేదు. ఆకోయబడిన అద్దము బయటపడియుండును." అని సుమబాల పలికెను.

ద్వారము దెఱచిన సవ్వడి వినవచ్చెను. ఇరువురు పురుషులు వారిని సమీపించుచుండిరి. ఒకఁడు పొట్టిగా గుండ్రముగా బట్టతల గలిగియుండెను. రెండవవాఁడు యువకుఁడు. సన్నగా చురుకుగా నుండెను. వారుభయులును తండ్రికొడుకులవలె నుండిరి.

జయంతశ్రీ చకితయై లేచి నిలువఁబడియెను. వారిని జూచు కొలఁదియు నామెలో నమిత విస్మయమును, అనుమానమును గలుగసాగెను. నిశ్చయముగా ఆమె యెదురుచూచుచున్న స్నేహితులు-గిరిధరసోదరులు-వీరు కారు. వీరెవ్వరో క్రొత్తవారు.

"వృద్ధుఁడు ముందునకువంగి నమస్కరించి నాపేరు సుజీవరధిమణా. నేనొక భూస్వామిని. ఈతఁడు నాకుమారుఁడు." మేము లాహోరునుండి నేఁటియుదయమే యిక్కడికివచ్చితిమి." అనియెను.

"మీరాకకుఁ గారణమేమి?" యని జయంతశ్రీ ప్రశ్నించెను.

"మీ నాయనగారితో మాటలాడవలెనని మాసంకల్పము. కాని వారు లేరని తెలియుటచే మీదర్శన మపేక్షించితిమి." అనుచు నావృద్ధుఁడొక యాసనముపై నుపవేష్టించెను. యువకుఁడు నట్లేగావించెను.

జయంతశ్రీ సుమబాల లిరువురును నొకరిముఖ మొకరు వ్యత్యస్త హృదయములతోఁ జూచుకొనిరి.

"ఈ భవనమెంత శోభావంతముగనున్నది?" అని యాయువకుఁ డని యెను.

"అవును. నాయనా! ఇట్టి కళానిలయమా భవనము ఈప్రాంతములం దెచ్చటను లేదు." అని యావృద్ధుఁడు మాఱుపలికెను.

జయంతశ్రీ కొంచెము ధైర్యము తెచ్చుకొనియెను. ఆమె ఒక యడుగు ముందునకువైచి "అయ్యా! క్షమింపుఁడు. మీరు వచ్చినపనియేమో త్వరగా చెప్పుడు." అని యొక్కింతకఠినముగా నడిగెను. ఆవృద్ధుఁడు కాలుమీద కాలువైచుకొని కుర్చీవెనుకకుఁ జేరగిలబడెను. తరువాత తన రెండు చేతులను కోటు జేబులలోనికిదూర్చి చెప్పదొడంగెను.

"క్షితీంద్రనాథుఁడు ఒక మోటారుకారును విక్రయింపదలఁచినాఁడని వార్తాపత్రికలో జూచితిని. మాకును కొండల నెక్కగలిగిన కారు కావల యును. అనగా అరువది 'హార్సుపవరు' గలిగినది."

"అరువది 'హార్సుపవరు' గలిగిన కారొకటి మాకడనున్నది. కాని దానిని మేము విక్రయింపదలకొనలేదు. నేఁడు దానిని మానాయనగా రుప యోగించుచున్నారు."

"బహుశః అది మేము గుఱ్ఱపుశాలలో చూచినదై యుండవచ్చును."

"కాదుకాదు. అది నలువది "హార్సుపవరు" కలదిమాత్రమే. అది నాయది. మీకు నిజముగా కొండలెక్కగలిగిన కారు కావలెనేని మాదగ్గర నూఱు "హార్సుపవరు" గల కారున్నది. దానిని మానాయనగారు విక్రయింప జూచుచున్నారు. కొంచెము తాళుఁడు. సుమబాలా! దాని ఛాయాచిత్ర మెక్కడ? అది యిక్కడనే పడియుండవలెను"

అని యాబాలిక లిరువురునులేచి గవాక్షమునకావల గోడకుఁ జేర్పఁ బడిన బల్లమీనున్న కాగితములను ఆ ఛాయాచిత్రమునకై పరిశోధింపదొడఁ గిరి. వారు మొగములు మరల్చినంతనే యాయువకునిచేయి ఈఁగనుబట్టు బల్లి నాలుకవలె తటాలునబోయి యా రజతసాలభంజికను దీసికొని జేబులో బడ వైచుకొనియెను.

వృద్ధుఁ డాబాలికల నుపలక్షించుచుండెను. కాని యువకుఁడు చేసిన పనిని కనిపెట్టకపోవలేదు. వెంటనే ఆతఁడు ముఖములో ఏమాత్రమును మార్పును రానీయక యువకునికే వినబడునట్లు కోపముతో "మూర్ఖుఁడా! దానిని యథాస్థానమున బెట్టివేయుము" అని యాజ్ఞాపించెను.

యువకుడు మరల తన హస్తలాఘవమును ప్రదర్శించెను. ఆ రజత సాలభంజిక యథాస్థానమున వెంటనే ప్రతిష్ఠితమయ్యెను.

జయంతశ్రీ వెనుదిరిగెను. వృద్ధుడొక నిట్టూర్పు దీసికొనియెను. ఆమె ఆ మోటారుకారు ఛాయాచిత్రమును దీసికొనివచ్చి అవృద్ధుని చేతి కందిచ్చెను. అతడు సువర్ణ సులోచనములను దగిలించుకొని చిత్రమును పరిశీలించుచు "ఒహో! ఇదియా! దీనినిగురించి మాటలాడవలసినది! ఇది గౌమాత్రమని చెప్పుచున్నారు?" అని ప్రశ్నించెను.

"నా కీ వేగములతో నెంతమాత్రమును సంబంధములేదు. మీరు మా నాయనగారితో మాటలాడవలసినది. వారు త్వరలో నేరాగలరు." అని జయంతిశ్రీ చెప్పెను.

వృద్ధుడు లేచెను. "మేము పోయి మరల వచ్చెదము. చిరకాలమును వృథాపుచ్చినందులకు క్షమింప వేడుచున్నాను." అనియెను.

"మరేమియును లేదు." అని జయంతశ్రీ సమాధానపఱచెను.

"సెలవు. నమస్కారము" అని వారిరువురును వెడలిపోయిరి.

జయంతశ్రీ గవాక్షముకడకుబోవుచు "ఏమి విచిత్రపురుషులు—ఎవరైనను ఆనూరు "హార్సుపవరు" మోటారుకారును కొనినచో నాయనగారు మిగుల సంతుష్టులగుదురు. దీని నష్టముబోవుటయు చాలా ఆశ్చర్యజనకముగా నున్నది. ఇది యెట్లు జరుగునో యూహింపవచ్చును. శ్రీ తుషారకాంతుడింతదనుక రాకపోవుటగూడ చిత్రముగానున్నది. ఎనిమిది గంటలకు పూర్వమే వత్తునని నాతోఁ జెప్పినాడు." అని స్వగతముగా ననుకొనియెను.

ఆమె ఒక వాలుకుర్చీలోఁ గొన్ని క్షణములు మేనుపాచెను. వెంటనే లేచి గవాక్షముకడకు బోయి దూరమును జేరు రాజమార్గము నుపలక్షించుచు గూర్చుండెను. ఆమున్న ప్రదేశమునందుండుటచే నామందిరమునుండి రాజమార్గము మూడు మైళ్లవరకు దృగ్గోచరమగుచుండెను.

సుమబాలకూడ [illegible] ముగించి గవాక్షముకడకు వచ్చెను. ఆమె రాజమార్గమువంక దృష్టిసారించి "అమ్మా! అటుచూడుము." అని కేకవైచెను.

"ఏమిటది?" అని జయంతశ్రీ లేచి సుమబాల చూపినవైపులకు తన దృష్టులను ప్రసరించెను.

"ఒక అశ్వికుడు! చూడుము - వాయువేగముతో నిటువచ్చుచున్నాడు."

"అతడు తుషారకాంతరాయలు"

"అతఁడే! సందేహములేదు. అతఁడు వత్తునన్న వేళకు సరిగా వచ్చినాడు."

"అతఁడు వచ్చుటకింకను పావుగంటకాలము పట్టును. ఆతఁ డుద్యానవనమంతయు జుట్టుతిరిగి రావలయును. సరాసరి వచ్చుటకు కంచెకడ్డము."

"అతఁడు సరాసరి వచ్చుచున్నాఁడు"

నిజముగా నాయాశ్వికుఁడు రాజమార్గమును వదలి విశాలశాద్వలస్థలమున కడ్డముగా గుఱ్ఱమును బరుగెత్తించుచుండెను. పదిక్షణములలో నాతఁడు కందక తీరమును జేరి, పండ్రెండడుగుల వెడల్పుగల యాదాని నొక్కుదుటున లంఘింపజేసి ఉద్యానమును జేరుకొనియెను.

# 3

## అపహృతమగు చిత్రరూపు

ప్రాణము లరచేతిలోఁ బెట్టుకొని సుమబాల తన బల్లకడకు జేరెను. ఆమె గుండెలు దడదడ కొట్టుకొనసాగెను. శ్రీ కుమారకాంతరాయలు చెంగున గుఱ్ఱముపై కందకమును లంఘించుటయును నాతఁడు నేరుగా నుద్యానమును జేరఁగనే సేవకుఁడొకఁడు పరుగునబోయి గుఱ్ఱమును పట్టుకొనుటయును నామె చూడనేలేదు. ఆతఁడు కందకమును దాటునప్పుడేమి ప్రమాదము సంభవించునో యని యామె యొక్కపెట్టున తల్లడిల్లిపోయెను. ఆతఁడు లోనికిఁ బ్రవేశించినపుడు సైతము ఆమె ఇంకా ఆందోళనములోనేయుండి తన యెదుట జరుగుచున్నదానిని సరిగాఁ జూడఁజాలకపోయెను.

రాయలు ప్రవేశించినతోడనే జయంతిశ్రీ కుడిచేతినెత్తి ముద్దుపెట్టుకొనియెను. తానొక కుర్చీలాగికొని ఆమెకు దగ్గరగా బల్లముందర కూర్చొనియెను. సుమబాల వెంటనే పోయి ఒక కప్పు టీ తీసికొనివచ్చి ఆతని కిచ్చెను.

రాయలును జయంతిశ్రీయును తమలోఁదాము ముచ్చటించుకొనసాగిరి. సుమబాల శుభలేఖలను వ్రాయఁదొడఁగెను. జయంతిశ్రీ వీపు ఆమె వైపులకుండెను. ఆమె కెదురుగ గూర్చునియున్న శ్రీ కుమారకాంతరాయల మొగము సుమబాలకు విస్పష్టముగఁ గానవచ్చుచుండెను.

రాయల మొగము ప్రశాంత గంభీరముగానుండెను. ఆయన మాటల లోని ప్రతిభావమును ముఖములో ప్రస్ఫుటమగుచుండెను. ఒక్కొక్కప్పుడు

వారిరువురి దృక్కులును గలసినప్పుడు సుమబాల తన దృష్టులను మరల్చి వైచుకొనుచుండెను. రాయలు తన దృష్టులను మగుడించినంతనే ఆమె అతని వదన సుధారసమును దనివితీఱఁ గ్రోలుచుండెను.

రాయలు టీ త్రాగుట ముగించెను. ఆయన తన జేబులోనుండి ఒక చక్కని చిన్న తోలుసంచి నొకదానినితీసి యందులోనుండి ఒక పచ్చల పతకమును వెలికిదీసి జయంతశ్రీకి బహూకరించెను.

"ఓహో! ఎంతబాగుగానున్నది" అని ఆమె సంతోషము పట్టజాలక బిగ్గఱగా నఱచెను.

ఆమె వెంటనే దానిని ధరించి అద్దముముందఱ నిలువబడెను. కాని ఆమె యెదలిపై నాపతకమంతగా రాణింపలేదు.

జయంతశ్రీ తన యందముజూచికొని తనలోఁ దాను బొంగిపోయెను. తనకది బాగుండలేదను అనుమానముసైతము ఆమె మనమున పొడసూపలేదు.

ఇంతలో రాయలదృష్టి బల్లపైనున్న శుభలేఖలవంకఁ బ్రసరించెను. వానినిజూచి "అబ్బా! ఇవియన్నియు శుభలేఖలేనా?" అనియెను.

"అవును. అవి ఒక మూఁడవవంతుమాత్రమే!" అని జయంతశ్రీ గర్వముతో బదులుచెప్పెను.

"ప్రపంచమునంతను ఆహ్వానించుచున్నటులున్నది!" యని రాయలు చిఱునగవుతో ననియెను. కాని అతని కన్నులలో నంతలో నొక యపహాస్యసూచకభావము తళుక్కని మెఱసి మాయమైపోయెను.

రాయలు సుమబాలను సమీపించి "సుమబాలా! ఇంచుకసేపు వీణ వాయించెదవా? నిన్న నీగానము వినుభాగ్యము కలిగినది. ఆహా! ఏమి మధుర సంగీతము!" అని ప్రార్థించెను.

జయంతిశ్రీ ఆనిమాటల కడ్డమువచ్చి "ఆమె చేయవలసిన పని చాలాయున్నది. వీణ వాయించుటకిది యామె తీఱిక సమయముకాదు." అని వారించెను.

"ఎంత పనియున్నను-ఇది పనిచేయవలసిన సమయముకాదు. ప్రాణేశ్వరీ! జయంతశ్రీ! ఆమె కొక పదినిమిషములకాలము సెలవొసంగుము." అని రాయలు తిరుగనర్థించెను.

జయంతశ్రీ: "సరియే! కాని-మీతో ముఖ్యవిషయములు మాటలాడవలసి యున్నది." అనియెను.

రాయలు: అవును, మఱచినాను. నేనుకూడా చాలా ముఖ్యవిషయములు నీతోఁ జెప్పవలసియున్నది. సుమబాలను నిన్నును గలిపి నేను తీసిన ఛాయాచిత్రి మిదిగో! చూడుము."

జయంతశ్రీ: "ఇదియొక ముఖ్యవిషయమా?"

రాయలు: "అవును. అన్ని స్వల్పవిషయములకువలెనే యిదికూడ చాలా ముఖ్యము. ఈ ఛాయాచిత్రము బాగుగానున్నదా?"

జయంతశ్రీ ఛాయాచిత్రము నందుకొని పరిశీలించుచు "బాగుగానుండు టయా? మా మొగములు వెలవెల బోవుచున్నవి." అనెను.

తుషారకాంతరాయలును ఆచిత్రమువంక తదేకదృష్టితోఁ జూచుచు "అవును. నిజముగా నీమొగము వెలవెలబోవుచున్నది. సుమబాలా! నీవు చెప్పుము. మొగములసంగతిమాని మీభంగిమలనుగుఱించి ప్రస్తావింతము. చూడుము! నీపయ్యెద ఎంతసొగసుగా వ్రేలాడుచున్నదో!" అని పలికెను.

"తుషారా! ఇదియేమి?" అని జయంతశ్రీ ముఖము ముడుచుకొనియెను.

రాయ లామె ముఖవైరి గనిపెట్టి "ప్రాణప్రియా! మఱచితిని. నీనేవో ముఖ్యవిషయములు ముచ్చటింపఁ బూనితివి. చెప్పుము. శ్రద్ధగా వినియెదను." అని సుమబాలచేతిలోని ఛాయాచిత్రమును దీసికొని జేబులోఁ బెట్టికొనెను.

"రాజామాయి నగరమునుండి టెలిఫోనులో చెప్పినది. మనకు కానికము లనుగోయు దంతపుచాకు ఒకటి, రెండు సిరాబుడ్లు నేఁడు పంపినారఁట." అని జయంతశ్రీ పలికెను.

"ఓహో! భేషుగానున్నది." అని తుషారకాంతరాయలు బిగ్గఱగా నవ్వెను.

"మఱియొక ముత్యాలహారముకూడ."

"మఱీ భేషుగానున్నది." అని రాయలు మఱింత బిగ్గఱగా నవ్వెను.

"పిల్లవానివలె నీకీ వెఱ్ఱినవ్వెందులకు వచ్చుచున్నది? వస్తువుల విలువ తెలిసికొనియే నవ్వుచున్నావా?" అని జయంతశ్రీ పరుషముగా నడిగెను.

"ప్రియా! క్షమింతువుగాక! ఆముత్యాలహారమును మీనాయనగారి స్నేహితులు పంపియుందురు. నిజమేనా?"

"అవును. ఎందులకు?"

"ఆ దంతపుచాకు, సిరాబుడ్లు, ఎవరో నాపక్షమున బీదవారు పంపి యుందురు."

"అవును. ఏమందువు?"

"నేనేమియు ననను. హెచ్చుతగ్గులు సరిసమానమగుచున్నవి." అని రాయలు హేళనగా మరల నవ్వెను.

జయంతిశ్రీ ముఖము కందిపోయెను. ఆమెకన్నులలో చూపులు చుఱ చుఱలాడినవి.

"నాయందు మీ కేమాత్రమును లక్ష్యములేదు." అని ఆమె కోప గించుకొనెను.

"అయ్యో! అట్లనెదవేమి! నిన్ను పూజించుచున్నాను." అని రాయ లనియెను.

జయంతశ్రీ గవాక్షము నొద్దకుఁబోయి ఆకాశమునుజూచుచు నిలు చుండెను. రాయ లామందిరములో నటునిటు తిరుగుచు గోడలపై నలంకరించి యున్న దనపూర్వుల తైలవర్ణ చిత్రములను సావధానముగాఁ బరిశీలించు చుండెను సుమబాల వ్రాయుచునే అప్పుడప్పుడు రాయలవంక దృష్టులు ప్రస రించుచుండెను. వారిదృష్టులు కలిసికొనినపుడు రాయ లొకసారి చిఱునవ్వు నవ్వెను. కోపముతోనున్న జయంతశ్రీ అట్లే ఆకాశమువంక జూచుచు నిలువఁబడియుండెను.

ఆ పటములమధ్య నొకదానికి సరిపడు వెలితి కానవచ్చెను. దానిని జూచి రాయలు "పురాతనచిత్రముల నన్నింటినుంచి నా నూతనచిత్రమును దీసివైచినారేమి?" అని ప్రశ్నించెను.

జయంతశ్రీ గిరుక్కున మఱలెను. సుమబాల వ్రాత నిలిపెను. వారు ఆశ్చర్యముతో నాతనివంకఁ జూడసాగిరి.

"అక్కడ నాచిత్ర ముండవలయును. మీరు దాని నేమిచేసినారు?" అని రాయలు మఱల ప్రశ్నించెను.

"మమ్ములను మఱల నవహేళన జేయుటకు బూనుకొన్నారా?" అని జయంతశ్రీ పలికెను.

"ప్రభూ! మీకుఁ దెలిసియేయుండును." అని సుమబాల పలికెను.

"దాని వివరములన్నియు మీకు వ్రాసి పంపితిమి. మూఁడేండ్లు దాటి నవి. మీకవి చేరలేదా?" అని జయంతశ్రీ అడిగెను.

"నాకేమియుఁ దెలియదు. మూఁడేండ్లక్రిందట నే నెచ్చటనుంటినో నాకే జ్ఞాపకములేదు."

"కాని-ఆవిషయము బహు విచిత్రమైనది. దేశమంతయు తహతహ లాడిపోయినది. ఆమీచిత్తరువు అపహరింపఁబడినది."

"అపహరణమా! ఎవ రపహరించినారు?"

జయంతశ్రీ విశాలమందిరము నతిక్రమించి యపహృతమగు చిత్తరు వుండినచోటికి వచ్చెను.

"ఇదిగో! చూడుఁడు." అని ఆమె పైనుండి వ్రేలాడుచున్న సుకూాల ఖండము నొకింతమిక తొలఁగించెను. ఆచిత్తరువున కాధారభూతము గానున్న యొక కొయ్యచెక్కపై నీక్రింది అక్షరములు స్పష్టముగాఁ గానవచ్చెను.

## "దండధర - తులసీదాసు"

"చూచినారా! ఏమందురు?" అని జయంతశ్రీ ప్రశ్నించెను.

"దండధరుఁడా!" అని రాయ లాశ్చర్యభావములో కేకగా నని యెను.

"తన నామమును లిఖించి పోయినాఁడు. ఆతఁడెప్పుడు నిట్లే చేయు చుండును." అని సుమబాల పలికెను.

"ఈ దండధరుఁడెవరు? ఈతని పనియేమి?" అని రాయ లడిగెను.

"ఏమీ! దండధరు నెఱుంగరా! ఏమిచోద్యము!" అని జయంతశ్రీ యాబ్బురపాటు దోపఁబలికెను.

"నాకేమియును దెలియదు. నిజము చెప్పుచున్నాను." అని రాయ లనియెను.

"నిజముగా మీరు దండధరుని పేరు వినలేదా! దేశమంతటిలో నంతటి ధీరోదారుఁడగు చోరుఁడులేఁడు. ఆతఁడు భాగ్యవంతులకు శత్రువుఁడు. బీద లకుఁ బెన్నిధానము. అసమాన ప్రజ్ఞాశాలుఁడు. కపట వేషధారణమందు నిరుపమాన నైపుణ్యముగలవాఁడు. కడుధైర్యశాలి. పది సంవత్సరములనుండి రక్షక భటశాఖవారిని ముప్పుతిప్పల బెట్టుచున్నాఁడు. పేరుగన్న అపరాధ పరిశోధకుల నెందరినో మోసగించి తప్పించుకొని తిరుగుచున్నాఁడు. ఆతఁడు విశేషించి దేశభక్తుఁడు. తన దేశమును దేశములోని ప్రజలను ప్రాణసమాన ముగాఁ బ్రేమించును. మానవ సమాజ శ్రేయమునకుఁగల నిరోధకారణము లందే యాతనికి విరోధము. అటువంటివానిని మీ రెఱుంగకపోవుట నిజ మగునా?" అని జయంతశ్రీ వాక్రుచ్చెను.

"నిజముగా నెఱుంగను. అతఁడెట్లుండును?" అని రాయలు మఱల ప్రశ్నించెను.

"అతని నిజస్వరూపము నెవ్వరు నెఱుంగరు. ఎల్లప్పుడు నేదోయొక మాఱువేషములోనే యుండును. అతఁడు రెండు పర్యాయములు రాజప్రతినిధి మందిరములో విందారగించెను."

"ఎవ్వరు నెఱుంగకున్న అవిషయ మెట్లు తెలిసినది?"

"ఎట్లనఁగా-విందు పూర్తియగుటకుఁ బూర్వమే విందలలో నొక రద్పశ్యులగుటయు, రాజ మందిరాంతర్భాగమున లోహ పేటికలోఁగల నవ రత్న మండిత మణిమయ సువర్ణభూషణము లపహరింపఁబడుటయు జరుగుట మూలమున."

"సర్వమునా?"

"సర్వమును. అంతమాత్రమే కాదు. తన నామాక్షరములు గలిగిన కాగితముపై "ఇది పేదలగు ప్రజలసొమ్ము. నేను చేసినది చౌర్యముగాదు. పున రుద్ధరణము." అని వ్రాసి దాని నా పేటికలోఁబెట్టి పోయినాఁడు."

"ఇది మోసము కాదా?"

"కాదు. మహాప్రభూ! ఇంతకన్న మిన్నయగు మఱియొక ఘన కార్యము చేసినాఁడు. బీదజనులు ధనమును దాఁచుకొనుచున్న ధారా బ్యాంకుసంగతి మీకుఁ దెలియు ననుకొందును."

"అవును. నే నెఱుగుదును. ధారాపతిబ్యాంకుద్వారా ప్రజలను మోసగించి పదిలక్షల ధనమును గడించినాఁడు."

"అతఁడే! దండధరుఁడు ధారాపతిని సొంతముగా దోచుకొన్నాఁడు. తరువాత అధనమును ధారాపతిచే మోసగింపబడిన ప్రజలందఱికి బంచిపెట్టి నాఁడు."

"అట్లయినచో నీతఁడు చోరుఁడుగా నేరఁడు. ధర్మ కార్యతత్పరుఁడు పరోపకార ధురీణుఁడని తోఁచుచున్నది." అని రాయ లనియెను.

"అతఁడొక విచిత్రపురుషుడు. మానాయనగారిని దోచుకొనుటలో సైతము ధర్మ కార్యాచరణము గన్పడుచున్నది."

"మంచిది. కాని నాచిత్రపటము నపహరించుటలో నట్టి యుద్దేశ మెద్దియును గానరాదు. దానివిలువ బహు స్వల్పము."

"మీరు పొరబడుచున్నారు. అతఁడు మీ పటము నొక్కదానినే తీసికొని పోవలేదు. మానాయనగారు సేకరించిన ప్రాచీన చిత్రకళా సంప్రదాయమును గురించిన అమూల్య చిత్రములన్నియుఁ బోయినవి."

"అలాగుననా! అదెట్లు సంభవించినది? మీనాయనగారు వానిని ధనముకంటె నెక్కుడు జాగరూకతతో సంరక్షించుచుండెడివారుగదా!"

"అవును. నిజమే! మితిమీరిన శ్రద్ధయే యవి పోవుటకుఁ గారణము."

"చాల చిత్రముగా నున్నది." అని రాయలు ప్రక్కనున్న సడక కుర్చీపై వ్రాలి "ఆవివరము లన్నియు నాకుఁ జెప్పుము. చూడగా నీదుర్గము లోనే దండధరునికి సహాయు లున్నారని తోఁచుచున్నది." అనియెను.

"అవును ఒక సహాయుఁ డున్నాఁడు."

"ఎవరు?"

"మా నాయనగారు"

"ఏల యీరీతిగా మాటాడెదవు?"

"మీరు సావధానముగా వినుఁడు."

ఒకనాఁటి ఉదయము నాయనగారికి ఒక ఉత్తరము వచ్చినది. - క్షణమాగుఁడు. సుమబాలా! బీరువాలో నున్న దండధరుని ఉత్తరమును గొని రమ్ము"

సుమబాలలేచి ఆబీరువాకడకుఁ బోయి ఒక ఉత్తరమును గొనివచ్చి జయంతశ్రీ కొసంగెను. ఆమె దాని నందుకొని

"ఇదియే ఆఉత్తరము. దీనిపై మానాయనగారి విలాసముగలదు." అనుచు దానిని రాయలచేతి కిచ్చెను.

రాయలు దానిని తెఱచిచూచెను.

"ఈవ్రాత చిత్రముగానున్నది." అని అతఁ డనియెను.

"చదువుఁడు" అని జయంతశ్రీ పలికెను. అందలి 'దస్తూరి' అచ్చువలె నుండెను. రచన క్లుప్తముగను, - అక్లిష్టముగను ఉండెను.

"మహాశయా !

ముఖాముఖి పరిచయము లేకుండఁగనే యీలేఖ వ్రాయ సాహసించినందులకు క్షమింతురుగాక! ప్రత్యక్షముగా నన్ను మీరు చూచియుండక పోయినను నాపేరైనను మీరు వినియుందురను నమ్మకముతో మీకు వ్రాయుచున్నాను.

మీరు అపూర్వములైన చిత్రకళాఖండములను చారిత్రక ప్రసిద్ధి నొందిన యనర్ఘవస్తుసముదాయమును శిల్పములను సేకరించి యుంచినారు. వానిలో అశోకచక్రవర్తి కిరీటముగూడకలదు. వానియందు నాకు ఎంతయో మక్కువ. మీరు వాని నన్నింటిని దీసి జాగ్రత్తగా పెట్టెలలో భద్రపఱచి నా పేర కాశీఘట్టమునకుఁ బంపగోరుచున్నాను. మీరట్లు చేయకుందురేని ఆగస్టు 7వ తేదీ గురువారము నాఁటి రాత్రికి నేనే స్వయముగా వచ్చి దీసి కొని పోవుదును.

శ్రమకలిగించినందులకు మన్నింపఁగోరు తమ విధేయుఁడు,
దండధరతులసీదాసు.

తాజాకలం - మీ చిత్రములకు అద్దములు లేవని విన్నాను. నాకుఁ బంపుటకు మున్ను వానికి అద్దములు వేయించుట అవసరము. అద్దములున్న యెడల పటముల శోభ భంగపడునని కొందఱి విజ్ఞుల అభిప్రాయమైనను అవి వానిని సంరక్షించి దీర్ఘకాల ముండునట్లు చేయఁగలవు. ఈ అధిక శ్రమ నైనను మీరు ఉత్సాహముతో స్వీకరింతురని నమ్ముచున్నాను. ద. తు."

రామారావు ఉత్తరమును ముగించి పెద్దగా నవ్వెను.

"ఇది విచిత్రముగానున్నది. మీ నాయనగారు చాలగా నవ్వుకొని యుందురు."

"నవ్వుటయా? కాదు. ఆయన ముఖమును మీరుచూచి యుండవలసినది. సర్వమును యథార్థముగా జరుగఁగలదని విశ్వసించెను."

"వానిని కాశీఘట్టమునకు స్వయముగాఁ బంపలేదుగదా!

"లేదు. కాని ఆయనకు మనశ్శాంతి లేకుండెను. ప్రతిపర్యాయమును రక్షణభటశాఖవారు దండధరుని మాయలలోఁ జిక్కుకొని పరాజితులగుటచే నీపర్యాయ మాయన సైనికదళ సహాయమును గోరెను. నాయనగారి స్నేహితులలో నొకదళపతి కలఁడు. ఆతనికి దండధరుని లేఖనుజూపి సహాయమును కోరెను. దళపతి నవ్వి ఒకనాయకుని ఆఱుగురు సైనికులను ఆరాత్రి మాయింటిని సంరక్షించుటకు బంపెను. వారు వత్తురన్న వృత్తాంతము చోరులకు దెలియకుండుటకై వారు ఆనాఁటి రాత్రి ఎనిమిదిగంటల రైలులో దిగుటకు ఏర్పాటులు చేయబడెను. వారట్లే వచ్చిరి. వారేడుగురును దృఢకాయులు బలిష్ఠులు. వారు మాయింటనే భోజనము చేసిరి. నాయకుఁడు వారిని చిత్రపటములున్న మధ్యహాలులోను, తక్కిన వస్తువులుగల గదుల

లోను ప్రదేశములు నిర్దేశించి చూపి సుప్రమత్తులై యుండవలసినదని హెచ్చరించెను. మేము పదునొకండు గంటలకు బవ్వళించుటకుఁ బోయితిమి. చోరులతో నెట్టి పోరాటము జరుగుచున్నను మేము గదులవీడి వెలుపలికి రాఁజాలమని చెప్పితిమి. నాకు ఉద్రేకము మితిమీరితి ఎంత ప్రయత్నించినను నిద్దుర బట్టలేదు. రెండుగంటలు కొట్టిన పిమ్మట నిద్రపట్టినది. బాగుగా తెల్లవారినపిదపగాని మెలకువ రాలేదు. ఆరాత్రి యంతయు శాంతముగా గడచిపోయినది. ఏమాత్రము ధ్వనికూడ లేదు. నేనులేచి సుమబాలను నాయనగారిని లేపితిని. మేము ముఖములుకడిగికొని దుస్తులు మార్చి మేడదిగి క్రిందికి వచ్చితిమి."

జయంతశ్రీ ఆఁగెను. రాయలాతురతతో "ఏమిజరిగినది? చెప్పుము. చెప్పుము." అని త్వరపెట్టెను.

జయంతశ్రీ:- చెప్పుట కేమున్నది? ఏమి జరగవలెనో అది జరిగినది.

రాయలు:- ఏమైనది?

జయంతశ్రీ:- సర్వమును పోయినది. చిత్రములు, శిల్పములు, చారిత్రకప్రసిద్ధి గన్న వస్తువులు, మఱికొన్ని విలువగల సామానులు- అన్నియు నపహరింపబడినవి.

రాయలు:- అశోకుని కిరీటముగూడనా?

జయంతశ్రీ:- కాదు. అదియిక్కడలేదు. దానికి బదులు మీచిత్రపటమును గొనిపోయెను.

రాయలు:- కాని- ఈవృత్తాంతమును నమ్ముటకు వీలులేకున్నది. ఆ ఏడుగురు సైనికు లేమి చేయుచుండిరి? వారు మంత్రరుద్ధులైనారా? లేక చోరుల చేతులలో మరణమును పొందినారా?"

జయంతశ్రీ:- సైనికు లెవరు? సైనికులులేరు. నాయకుఁడులేఁడు. ఆ నాయకుఁడు దండధరుఁడు. ఆ సైనికులు అతని పరివారము.

రాయలు:- నాకర్థమగుటలేదు. మీనాయనగారి స్నేహితుఁడగు దళపతి ఒక నాయకుని ఆఱుగురు సైనికులను బంపెనుగదా! వారు రాలేదా?"

జయంతశ్రీ:- వారు అనుకొన్నప్రకారము రైలుదిగి వచ్చినారు. దారిలోనున్న చిన్న హోటలులో కాఫీ త్రాగినారు. తెల్లవాఱి తొమ్మిది గంటలవఱకు వారును వెంట వచ్చుచున్న సేవకుఁడును దారిపొడుగు

నను దుంగలవలె బడి నిద్రపోయిరి. ఆ కాఫీ హోటలు యజమాను నేమియుఁ జెప్పఁజాలక పోయెను. ఒక మోటారులో ఒక పెద్ద మనుష్యుఁడెవరో వచ్చి వారిని కాఫీ త్రాగుటకు బలవంతము చేసి నాఁడఁట. కాఫీ త్రాగినపిదప వారికి కొంచెము బద్ధకముగా నున్నట్లు గన్పట్టెను. తన మోటారులో వారినెక్కించుకొని యీదుర్గముకడ దిగబెట్టెదనని చెప్పి వారిని దీసికొనిపోయెను. వారికి స్పృహతప్పిన పిమ్మట ఒక్కొక్కరిని దింపి వారిపాదుగునను దన యిష్టమువచ్చిన చోటుల బరుండబెట్టెను. తెల్లవాటి తొమ్మిది గంటలుకొట్టువఱకు వారట్లే నిద్రపోవుచుండిరి. ఆమోటారులో వచ్చిన పెద్దమనుష్యుఁ డెవరో అతఁడెట్లు మత్తుద్రవ్యమును కాఫీలో జేర్పఁగలిగినాఁడో ఆ హోటలు యజమానికిఁ దెలియదు.”

రాయలు:- దండధరుఁడు కడు నైపుణ్యముతో నీపని గావించినట్లు తోచుచున్నది.”

జయంతశ్రీ:- అవును. అపరాధపరిశోధకుఁడగు దేవేంద్రవిజయుఁడు కలకత్తానగరమునుండి వచ్చి సమగ్రపరిశీలనము చేసియు నేమియుఁ దెలిసికొనలేకపోయెను. దేవేంద్రవిజయునకు దండధరుఁడన్న పరమాసహ్యము. వారిరువురకు నెప్పుడును వైరమే. కాని యింతవఱకు దండధరునిదే పైచేయి.

రాయలు:- అతఁడు నిజముగా గొప్ప మేధాసంపన్నుఁడగుట నిశ్చయము.

జయంతశ్రీ:- అందులకు సందేహములేదు. మఱియొకమాట. అతఁడు ప్రస్తుతము ఈప్రాంతములోనే యున్నాఁడన్నచో నేనాశ్చర్యపడను.

రాయలు:- ఏమనుచున్నావు?

జయంతశ్రీ:- నేను పరిహాసములు పలుకుటలేదు. చిత్రవిచిత్ర విషయములు జరుగుచున్నవి. ఇదివరకు యిక్కడనే అలమారపైనున్న యీరజతసాలభంజిక 'పియానో' మీఁదికి వచ్చినది. దానిని ముట్టుకొన్న వారులేరు. ఆగవాక్షమువంకఁ జూడుఁడు. సరిగా గడియ వేయుచోట నెవరో అద్దమును గోసివైచినారు.”

రాయలు:- అవును. ఈదుర్గము దుర్మార్గుల యాక్రమణమునకు గుఱియైనట్లు కనుపించుచున్నది.

జయంతశ్రీ:- నావస్తువులు ఎన్ని పర్యాయములో దొంగిలింపబడినవి.

## ౪

# విషయ పరిశీలనము

శ్రీ తుషారకాంతరాయలు లేచి అగవాక్షమును సమీపించి దానిని గొంతతడవు పరీక్షించెను. తరువాత భవనము వీడి వెలుపలికి వచ్చి అగవాక్షము క్రింది భూభాగమును గూడ నిశితముగాఁ బరీక్షించి వచ్చెను.

రాయలు:- ఇది నిగూఢ విషయముగా దోఁచుచున్నది. ఈఅద్దము పగిలినట్లు లేదు. పగిలినయెడల కొన్ని ముక్కలు వెలుపల బడియుండును. కాని దీనిని జాగ్రతతోఁ గోసివైచినారు. అమూల్యవస్తువులను ప్రాణ ప్రదముగాఁ గాపాడవలయునని మీ నాయనగారిని హెచ్చరించవలసి యున్నది."

జయంతశ్రీ:- నేను నట్లే భావించుచున్నాను. దండధరుఁడీ ప్రాంతముల లోనే సంచరించుచుండునని చెప్పలేదా?

రాయలు:- దండధరుఁడీ కర్వసమర్థుఁడగుట నిశ్చయమే! కాని అతఁ డొక్కఁడే యీ దేశమంతటికిని చోరుఁడని చెప్పుట భావ్యము కాదు గదా!

జయంతశ్రీ:- ఏమైన గానిండు. దండధరుఁడీ ప్రాంతములలో సంచారము చేయుచున్నాఁడనియే నానమ్మకము.

రాయలు:- అట్లే కానిమ్ము! తెలిసీ తెలియక నే నేల కాదనవలెను?

రాయలు నడయాడసాగెను. అప్పుడొక సేవకుఁడు ప్రవేశించి "అమ్మా! మిమ్ములను జూచుట కెవరో వచ్చినారు!" అని విన్నవించెను.

జయంతశ్రీ:- బదరీ! నీవు ద్వారమును గాచుచున్నావా!

బదరి:- అవును. నేనొక్కడనే యున్నాను. తక్కినవారందఱును స్టేషనుకు బోయినారు. వారిని లోనికిఁ దీసికొనివత్తునా?

జయంతశ్రీ:- వారెవరు?

బదరి :- ఇద్దరు పెద్దమనుష్యులు. వారు ముందుగానే యీసమావేశము నేర్పాటు చేసికొనినారఁట.

జయంతశ్రీ:- వారి నామధేయములు?

బదరి :- నాకుఁదెలియదు. పైగా జ్ఞాపక ముంచుకొనలేను.

రాయలు:- ద్వారమందున్న వారికిని యొక సుగుణమగానే యెన్నుకొన వచ్చును.

జయంతశ్రీ:- వారా సుజీవరులు కానేఅరు. నాయన గారింటిలో రారని వారికిఁ జెప్పియుంటిని.

బదరి :- వారు కాఁజాలరు.

జయంతశ్రీ:- అట్లయిన వారిని లోనికిఁ దీసికొనిరమ్ము.

బదరి వెడలిపోయెను. పోవుచు ద్వారములు తెఱచిపోయెను.

రాయలు:- ఈసుజీవరు లెవరు?

జయంతశ్రీ:- ఇంతకుఁ బూర్వమువేఁకొ ఇద్దఱు పురుషులను దీసికొనివచ్చెను. మొదట వారు మన స్నేహితులే కాని వారులోనికి వచ్చిన తరువాత మాతునుగదా ఎవరో గ్రామీణులవలె నున్నారు. అబ్బా! వారిని జూడఁగనే——

జయంతశ్రీ తటాలున నాఁగిపోయెను. ఆమె చెప్పుచున్న సుజీవరులే-తండ్రికొడుకులు- ద్వారమును దాఁటి లోనికి వచ్చుచుండిరి. వారిలో వృద్ధుఁడు వంగుచు నమస్కరించెను. కుమారుఁడును నమస్కరించుటకు వంగెను. వానివెనుక మఱియొక యువకుఁ డగపడియెను.

"వాఁడు నా రెండవ కుమారుఁడు. వాఁడు ఔషధముల వ్యాపారము చేయుచున్నాఁడు" అని యావృద్ధుఁడు రెండవయువకుని జూపుచుఁ బలి కెను. అతఁడును ఆమందిరములోనికిఁ బ్రవేశించి అందరికిని నమస్కరించి నిలువఁబడెను.

జయంతశ్రీ చకితయయ్యెను. ఆమెయించుక సమాళించుకొని "మా నాయన గారింకను రాలేదు. పాపము! మీరప్పుడే రెండు పర్యాయములు వచ్చినారు! నేనేమి చేయఁగలను?" అని పలికెను.

"అమ్మా! మీరు చింతింప నక్కఱలేదు. ఏమాత్రము నవసరము లేదు." అని యావృద్ధుఁడు పలికెను. తోడనే వారుముగ్గురును కుర్చీలను లాగికొని సావధానముగాఁ గూరుచుండిరి.

వారి చర్యనుజూచి జయంతశ్రీకి భయముచే మాటరాకుండ బోయెను. ఆమె ధైర్యము తెచ్చికొని "మా నాయన గారింకొక గంటవఱకు నింటికిరారు.

ఓ ప్పుడింకను ఆలస్యము కాఁగలదు అంతవఱకు మీ కాలమును వృథా పుచ్చుట నాకిష్టములేదు." అని పలికెను.

"మరేమియు నిబ్బందిలేదు." అని ఆవృద్ధుఁడు రాయలవైపు జూచుచు "అయ్యా! తమరీ కుటుంబములోనివారేగదా! అట్లయినచో ఆ మోటారుకారు బేరమునుగూర్చి ప్రస్తావించుకొందము. మీరెంతికీయఁదలఁచి కొనినారు?" అని ప్రశ్నించెను.

"అయ్యా! ఆవిషయములు నాకేవియును దెలియవు. క్షమింపుఁడు." అని రాయలు పలికెను.

వృద్ధసుజీవరుఁడు మాటాడనెంచెను. ఇంతలో బదరిలోనికివచ్చి మఱియొక యువకుని ప్రవేశపెట్టెను. ఆవృద్ధుఁడు వానిని జూడఁగనే "నీవిక్కడ కేలవచ్చితివి? 'పార్కు' దగ్గఱనుండుమని చెప్పితినిగదా!" యని ప్రశ్నించెను.

"నేనుకూడా మోటారు కారును జూడవలెననుకొన్నాను."

"అయ్యా! వీఁడు నా మూఁడవకుమారుఁడు. లాయరు పరీక్షకుఁ జదువుచున్నాఁడు. మోతీ! నీవుకూడ కూర్చుండుము." అని యావృద్ధుఁడు పలుకుచు నింకొక కుర్చీనిజూపెను.

"ఇంక నెందఱున్నారు?" అని జయంతశ్రీ వినబడీ వినబడనట్లు నెమ్మదిగాఁ బలికెను.

బదరి మరలలోనికివచ్చి "అమ్మా! నాయనగారు వచ్చినారు." అని విన్నవించెను.

జయంతశ్రీ ఒక దీర్ఘనిశ్వాసము వెడలించెను. ఆమెకు భారము తీఱినట్లు తోఁచెను. ఆమె వెంటనే వృద్ధునుద్దేశించి "మిమ్ములను నాయనగారి యొద్దకుఁ దీసికొనిపోయెదను. కారు ఖరీదుగురించి వారితోడనే మాటాడ వచ్చును" అని పలుకుచు నామె ద్వారమును దాఁటెను. సుజీవగుఁడు నలుగురును లేచి తండ్రియు కుమారులలో పెద్దవారిరువురును ఆమె ననుసరించిరి మోతీ నిలువబడి ఆమందిరమునందలి యలంకరణములను బరిశీలించుటకుఁ బోలె తటాపటాయించుచుండెను. ఉన్నట్లుండి అప్పపాటు కాలములో సమీపమున బల్లమీదనున్న వస్తువులలో రెంటిని సంగ్రహించి తన సహోదరులతోఁ గలియుటకు బయలుదేఱెను.

రాయలు వెనుకనుండి మూఁడుగంతులలోఁ బఱుగెత్తి ద్వారమునొద్ద మోతీని బట్టుకొని వెనుకకు లాగికొనివచ్చి తలుపులు మూసివైచెను.

"ఏమిపని చేసితివి? ఇంక చేయవుగదా!" అని రాయలు వానిని గద్దించెను.

"నేనేమి చేసితిని? అని మోతీ పట్టును విడిపించుకొనుటకుఁ బ్రయత్నము సేయుచుండెను.

"నీవొక 'సిగరెటుకేసు'ను దీసికొన్నావు." అని రాయ లనియెను.

"లేదు. లేదు. నేను తీసికొనలేను. అటువంటి దేదియును నాకుఁ దెలియదు." అని మోతీ తగ్గరపాటు చెందెను.

రాయలాతని యెడమచేతిని బట్టుకొని అతడు తీసికొనివచ్చుచున్న మోటారు టోపీలోనికి తన చేతిని జొనిపి అందులోనుండి ఒక వెండి 'సిగరెటు కేసు'ను బైటికిఁదీసి చూపించెను. మోతీ మొగము తెల్లబోయెను. ఆతఁడు భయముతో గుడ్లు తేలవైచెను.

"పొరబాటు. పొరబాటు–క్షమింపుఁడు. క్షమింపుఁడు" అని గడగడ వడఁకుచు వేడుకొనెను.

రాయలాతని చేతినివదలి మెడను బట్టుకొనెను. అతని కోటుముందరి జేబులోనుండి ఒక మొరాకో కేసును వెలుపలికి దీసెను. మోతీ కదలక మెదలక నిలువబడెను.

"ఇదికూడ పొరబాటేనా?" అని రాయలా 'మొరాకో కేసు'ను జూపుచు గద్దించెను.

"అయ్యో! దానిలోనున్నది పచ్చలపతకము! కొంచెములో కొంప మునిగిపోయియుండును!" అని సుమబాల ఆశ్చర్యభయావేశములతో నటించెను.

మోతీ రాయల కాళ్లపైఁ బడియెను. ఆతఁడు గద్గదస్వరముతో "క్షమింపుఁడు. ఎవరితోడను జెప్పకుఁడు. కరుణించి యీవిషయ మున్యులకుఁ దెలియనీయకుఁడు. మీపాదములంటి వేడుకొనుచున్నాను." అని ప్రార్థింపఁదొడఁగెను. అతని కన్నులవెంట అశ్రుధారలు గురియసాగెను.

రాయలు కోపము సమాళించుకొను ప్రయత్నములో బండ్లు పటపట కొఱుకుచు "దొంగవెధవా!" అని తిట్టెను.

"నేనెప్పుడు నిటువంటిపనులు చేయను. ఎన్నటికిని జేయను. దయ జూపుఁడు. మాతండ్రికిఁ దెలిసెనేని–అయ్యో! నాపని సర్వనాశనము కాఁగలదు. నన్ను వదలిపెట్టుఁడు" అని దీనుఁడై మోతీ వేడుకొనదొడఁగెను.

రాయలు కొంచెము తడవాలోచించెను. తరువాత నాతనివంక నాపాదమస్తకము జూచుచు జూచుచు "సరే! ఇప్పటికి నిన్ను వదలు చున్నాను. పో! అవతలికి పో!" అని తలుపులు తెఱచి వరండాలోనికి ఒక్క నెట్టునెట్టెను. ఆయుదుటునకు మోతీ పడబోయి యెట్లో ఆపుకొని "నమస్కారములు. సెలవు" అని బిగ్గఱగా అఱచుచుc బయిGRెను.

రాయలు ద్వారమును మూసి జేవురించిన ముఖముతో సుమబాలవంకc జూచెను.

రాయలు:- సుమబాలా! నీవెప్పుడైన నిట్టి దారుణకార్యమును జూచినావా? ఆచిన్నవాcడెట్లు బాగుపడcగలcడు? మన కండ్లయెదుటనే వానికెంతధైర్యము! విశేషించి అపరూప నిక్షేపమగు నీ పచ్చలపతకమును మఱల సాధింపcగలమా? అయ్యో! వానిని రక్షకభటులకు నొప్పగింప వలసినది!

సుమబాల:- కాదు. కాదు. మీరు వానిని వదలిపెట్టుటలో మంచిపనియే చేసినారు.

రాయలా పతకమున్న పెట్టెను పూర్వస్థానమునునుంచి సుమబాలను సమీపించెను.

రాయలు:- అదియేమి సుమబాలా! నీముఖము కలcతcజెందినట్లు కన్పించుచున్నది.

సుమబాల:- ఇది నన్ను వ్యత్యస్తను గావించినది. వాcడొక దౌర్భాగ్యుcడు. వాcడేల యీదొంగతనము చేయవలెను?

ఆమె కన్నులనుండి బాష్పములు ప్రవహింపc జొచ్చెను.

రాయలు:- నీవు వానిని గుఱించి జాలిcదలcచుచున్నావా?

సుమబాల:- అవును. నేనిట్టిదృశ్యములు చూచి భరింపజాలను. వాని కన్నులలో భయము ప్రత్యక్షమైనది. చౌర్యములో పిల్లికూనవలె పట్టుపడినాcడు. ఇట్టిపనులన్న నాకుc బరమాసహ్యము.

రాయలు:- సుమబాలా! ఎంత సున్నితమైన మనఃప్రవృత్తి గలదానవు! అని బుజ్జగించుచున్నవానివలె పలికెను.

సుమబాల:- మీరు వానిపై జాలివహించి వదలివైచితిరి. మీఅంతరంగము కృపాతరంగితము.

రాయలు:- అంతరంగ మేమి? అంతయును.

సుమబాల:- మీయంతరంగమని యెందులకన్నాననఁగా మీరు బాహ్యముగా కఠినులవలెఁ గన్పింతురు. ప్రాపంచికానుభవములలోఁగష్టము లనుభవించినవారందఱు నిట్లే యుందురని వింటిని. వారి వాక్కు లస్త్రతుల్యములైనను మనస్సు కోమలము.

రాయలు:- అది విజ్ఞులపట్ల వర్తింపఁగలదు. కాని నీవు ఉల్లాసముగా లేనట్లు దోఁచుచున్నది. నిజమేనా?

సుమబాల:- నేనా? ఎందులకు?

ఆమె ఉచ్చారణలో ఆతురత గన్పడెను.

రాయలు:- నీదరహాసములో విషాదరేఖ గోచరించుచున్నది. నీబిత్తరిచూపులలో నధైర్యము పొడగట్టుచున్నది. సుమబాలా! నీవు సంరక్షకులులేని పసిపిల్లవలె నున్నావు. నీవీ విశాల ప్రపంచములో ఏకాకినివా?

రాయలముఖము శాంత మధురమై యొప్పారెను. ఆతని కంఠస్వరమును శిన్నులను కరుణరసమును విరజిమ్మెను. సహజారుణములగు సుమబాలకపోలములు రాగరంజితము లయ్యెను ఆమె తలవంచి హీనస్వరముతో "అవును." అనియెను.

రాయలు:- సమీపబంధువులుగాని స్నేహితులుగాని లేరా?

సుమబాల:- లేరు.

రాయలు:- ఇక్కడగాదు. మీ స్వగ్రామములో.

సుమబాల:- ఎక్కడనులేరు. మాతండ్రి ఎల్లప్పుడును రాజకీయములైవీగా నే యుండెడివాఁడు. నాచిన్నతనమందే అండమాను దీవులలో చని పోయెను. నాఐదవయేట మాఅమ్మకూడ గతించెను.

రాయలు:- పాపము! పసిప్రాయమందే నీకుఁ గష్టములు ప్రారంభమైనవి.

సుమబాల:- నేను కష్టముల కలవాటు పడితిని. కాని- ఒకవిషయము మాత్రము నన్ను మిగుల బాధించుచున్నది. నాయోగక్షేమమును గుఱించి ఒక ఉత్తరమైనను వ్రాయువారు లేరు. ఇది అంతయు అజ్ఞానమేమో యని ఒక్కొక్కప్పు డనుకొనుచుందును.

ఆమె మందహాసముచేసెను. ఆమందహాసములో వెన్నెలలు విరిసినట్లుండెను.

అట్టి సమయమున ద్వారమును తెఱచికొని జయంతశ్రీ రొసరొప లాడుచు బ్రవేశించెను.

"సుమబాలా. నీతో నేపనిచెప్పినను ప్రయోజనము లేదు. ఇంత మంద మతివై పోవుచున్నావేమి? నేను ఉత్తరములు వ్రాసికొనుపెట్టెనుస్వయముగా నాసంచిలో బడవేయుమని చెప్పలేదా? నేను 'డ్రాయరును' లాగిచూతును గదా నాపెట్టె దానిలోనే యున్నది." అని యామె సుమబాలను పరుషోక్తు లాడెను.

సుమబాల:- అమ్మా! క్షమింపుము. పనితొందరలో మఱచితిని. ఇపుడు తీసి కొనిపొవు సామానుతో సవరించెదను.

జయంతశ్రీ:- అక్కఱలేదు. నేనే చూచుకొందును. అశ్రద్ధకు నీవు అవతారమూర్తివి.

రాయలు:- ప్రాణప్రియా! ఇదికేవలము ఒక చిన్నపొరబాటు. దీని కింత కోపమా! అని అతఁడు జయంతశ్రీ చుబుకమును స్పృశించెను.

జయంతశ్రీ:-మీరూరకుండుడు. గృహకృత్యములలో బోక్యము గలుగజేసికొను దురభ్యాస మొకటి మీకలవడినది. నేనొక సేవకు రాలిని మందలిం చుట కధికారములేదా?

రాయలా మెవంక తీవ్రముగాఁ జూచి "జయంతశ్రీ" అని నిరసన భావమును వ్యక్తీకరించెను.

జయంతశ్రీ సుమబాలను సమీపించి ఆమెకు బల్లపైనుండి క్రింద బడిన కొన్ని ఉత్తరములను కవరులను జూపించుచు "వానినన్నింటిని దీసికొని నాగదిలోనికి రమ్ము. త్వరగా రావలెను" అని ఆమందిరము వీడి విసవిస వెడలిపోయెను.

సుమబాల కామెప్రవర్తనము క్రొత్తగాదు. ఆమె నెమ్మదిగా లేచి క్రిందబడియున్న కాగితములను దీసికొనుట కుంకించెను. రాయలు వెంటనే లేచి "వలదు వలదు. నీవు కూర్చుండుము. నేను తీసికొని వచ్చెదను." అని యాతఁడు వంగి వానినన్నింటి నేరి బల్లపైఁ బెట్టెను. తరువాత నాతఁడు సుమబాల వంకఁ జూచుచు "సుమబాల! జయంతశ్రీ మాటలకు నీవు మనసులోఁ గష్టపడఁగూడదు. ఆమె హృదయము మృదువైనది. అది ఆమె స్వభావము. ఆమె కష్టమెటువంటిదో యెఱుఁగదు. బాల్యమునుండియు నామె యెదికోరిన

నది తెఱవేయుచున్నది. ఆ మెఱుఘూంకారములను లక్ష్యము సేయవలదు." అని సమాశ్వాసించెను.

సుమబాల:- లేదు. నేనెన్నటికిని బాధపడను.

రాయలు:- మంచిది. అట్లయిన చాలసంతోషము.

అని అప్రియత్నముగ ఆమె చేతిని దీసికొని కొంచెము వంగి ముద్దాడెను. సుమబాల ముఖము సంధ్యాసమయసూర్యబింబమువలె నెఱ్ఱనై పోయెను. ఆమె శిలాప్రతిమవలె నిలువబడెను కాని గుండెలు దడదడ కొట్టుకొనసాగెను. ఆయుద్వేగ మడంచుకొనుట కామె తన చేతితో గుండెలపదిమి పట్టుకొనెను. కొంతతడవున కామె తెప్పరిల్లి త్వరితగమనయై తడబడునడకలతో నామందిరమునుగడచి ద్వారమును దెఱచికొని యదృశ్యయయ్యెను.

౨

## దండధరుని ఉత్తరము.

స్వీయవదనమున మందహాసద్యుతులు మెఱయుచుండఁగా తుషారకాంతుఁడు సుమబాల వెడలిన ద్వారమువంకనే చూచుచుఁ గొంతతడవు నిలువఁబడెను. తరువాత బల్లను సమీపించి మొరాకోకేసుప్రక్క నున్న సిగరెట్టుకేసులోనుండి ఒక సిగరెట్టును దీసి వెలిగించి మేడమీఁదికిఁ బోయెను. అతఁడు మేడపైభాగమున ననాచ్ఛాదితవిశాలప్రదేశమును జేరి పిట్టగోడ నానుకొని కనుమూపుమేఱ పరిసరప్రాంతములను బరికింప సాగెను. అట్లు కొంతసేపుండిన పిమ్మట మేడదిగి క్రిందికివచ్చి తోఁటలోనికిఁ బోయెను. అక్కడ నొక శిలావేదిక కానబడఁగా దానిపై నుపవిష్టుఁడయ్యెను. రమణీయమగు నాయుద్యానవనశోభ ఆ ఏకాంతసమయమున నాతని కెంతయో హాయి చేకూర్చెను. అతఁడు శాంతచిత్తముతో మౌనమును భజింపనెంచెను కాని ఏవియో ఆలోచనలు ముసరుకొనుచుండెను. అతఁడు ముఖము ముడిచికొని ఆ ఆలోచనలన్నింటిని వెనుకకు నెట్టివైచెను. ఎట్టకేల కాతని ముఖముపై చిఱునగ వంకురించెను. అలలవలె తీయని వలపుతలఁపు లాతని పెనఁగొని కలఁతపెట్టెను. ఆ మధురస్మృతులలో దివ్యసౌందర్యవిరాజమానయగు సుమబాల

స్వరూపము, సుమబాల మందహాసము. సుమబాల కోమలత్రిపాకుణీత మనోహరాననము క్షణక్షణపరివర్తితములై యాతని పరవశునిగావించెను.

ఏదియో నిశ్చయమునకు వచ్చినవానివలె నాతఁడు కొంతవడికి లేచి మరలమేడ నెక్కి ఆవిశాలావరణ మంతయుఁ గలయఁజూచెను. క్రింద సింహద్వారమునొద్ద మనుష్యసమూహము గానవచ్చెను. అతఁడు వారినిజేరఁ బోయెను.

ఆసమూహ మధ్యమున క్షితీంద్రనాథుఁడు నిలుచబడియుండెను. ఆతని ఆకారముపొట్టిగా గుండ్రముగా నుండెను. పొడవైన తెల్లనిమీసము లాతని ముఖమునకు వన్నెదెచ్చుచుండెను. వ్యాపారానుభవముగలవానివలె నాతఁడు చేతులను ద్రిప్పుచు బిగ్గఱగా మాటలాడుచుండెను. రాయలు సమీపించుసరికి ఆతఁడిట్లనుచుండెను.

"అదియే కడసారిమాట. ఇష్టమగునేని తీసికొనుఁడు. లేదేని విరమించుకొనుఁడు."

"చాల పెద్దధర చెప్పుచున్నారు." అని వృద్ధ సుజీవరుఁడు దుఃఖసూచకస్వరముతోఁ బలికెను.

"పెద్దధరయా? నూఱుహార్సుపవరుగల కారును ఎనిమిదివేలకు ఎవఁడిచ్చునో నాకుఁ జూపుము. నన్నుఁ గాఁజేయవలెనని జూచుచున్నారు." అని క్షితీంద్రుఁడనెను.

"లేదు. లేదు." అని యావృద్ధుఁడు వినయముదోఁపఁ బలికెను.

"లేదందురేమి? నాకు బురిడీవేయవలెననియే మీఉద్దేశము. నేను పదమూఁడు వేలుపెట్టి తెచ్చినదానిని ఎనిమిదివేలకుఅడుగుట న్యాయమేనా? బహువిచిత్రముగానున్నది మీవ్యాపారము!" అని క్షితీంద్రుఁడు తీవ్రముగాఁ బలికెను.

"లేదు. లేదు." అని యావృద్ధుఁడు మఱల వినయము గదురఁబలికెను.

క్షితీంద్రునిజూచి వృద్ధ సుజీవరుఁడు భయపడుచున్నట్లు గానబడెను.

"అది యెట్లుపోవునో చూచినపిదప మాటాడుకొనవచ్చును. అంతవఱకు వేఁచియుండుఁడు. అనిక్షితీంద్రుఁడు పలికెను.

"ఎనిమిదివేలకంటె మేము భరింపఁజాలము. ఇప్పటికే యిదిచాల ప్రియము" అని సుజీవరుఁడనెను.

"చాలు లెండు. మీరు జీడివలె బట్టుకొని వదలిపెట్టకున్నారు. మీరు కారునెక్కి తిరిగి సర్వమును పరీక్ష చేసికొనువఱకు ఏమియును మాటలాడ కుడు." అని క్షితీంద్రుడు తన "కారుడ్రైవరు" వంకc దిరిగి "కిషన్ సింగ్! నీ-నిఆ 'కారు'లో స్టేషన్ వఱకు తీసికొనిపోయి దాని గుణగణముల నన్నింటిని వివరించిచూపుము. వారేమి చేయుమన్న నది చేయుము". అని ఆజ్ఞాపించెను.

అతఁడు కిషన్ సింగుకు కనుసైగ చేసి వృద్ధసుజీవరుని వంక కుఁదిరిగి "అయ్యో! మీరు వ్యాపారములోc బ్రజ్ఞావంతులు. అతని వెంటcబోయి 'కారు'ను జూcడుడు. సెలవు. నమస్కారము" అనెను.

వారు తండ్రికొడుకులు నలుగురును తిరుగ నమస్కారము జేయుచు వెడలిపోయిరి. వారు మలుపుదిరిగి కనుచూపు దాcటిపోవcగనే క్షితీంద్రుడు తుషారకాంతునివంకc జూచి "వారుకారును తప్పక తీసికొందురు." అనెను.

"మీవ్యాపార దక్షత అటువంటిది." అని తుషారకాంతుc డనియెను.

క్షితీంద్రునికన్నులు నవ్వుతో మిలమిల మెఱసిపోయెను.

"ఆకారును కొని నాలుcగు సంవత్సరములైనది దానిని ఎనిమిదివేలకు వారు తప్పక తీసికొనియెదరు. ఆఎనిమిదివేలకు ఒక 'జీపుకారు' రాcగలదు. కొండలనెక్కుటకు డొంకలలోc బోవుటకు అది చాలగ నుపకరింపcగలదు." అని క్షితీంద్రుడు పలికెను.

వారిరువురు మాటలాడుకొనుచు భవనములోని విశాలమందిరము ప్రవేశించిరి. బదరి రెండుదీపములను మాత్రమే వెలిగించెను. ఆవెలుతురు చాలక ఆమందిరము మసక మసకగా నుండె. క్షితీంద్రుడు పట్టుపఱుపుగల పడకకుర్చీపై మేనువాల్చెను.

క్షితీంద్రుడు:- తుషారకాంతా! నేడు ప్రభుత్వభవనములో విందును గురించియు, ప్రధానమంత్రి అభిభాషణముగురించియు ప్రశ్నింపవేమి?

తుషార:- ఏమైన విశేషమున్నదా?

క్షితీంద్రుడు:- నేcటి అవకాశమును పురస్కరించుకొని నేను ప్రధానమంత్రితో నీవ్యవహారమునుగురించి రహస్యముగా సంభాషించితిని. నిన్ను రాజగిరిసాంస్థానాధీశునిగా ప్రభుత్వపరిగణన రేపు అధ్యక్షుల వారి చేవ్రాలు కాcగలదు."

తుషార:- మీరు చాల శ్రమపడినారు. మీకృషి ఫలవంతమైనది. కృతజ్ఞుcడను.

క్షితీంద్ర:- కృషి ఫలించినపిమ్మట శ్రమకనబడదు. నీవు ఉచిత గౌరవ మర్యాదలతో ప్రభుత్వమువారిచే సంస్థానాధీశుఁడవుగా ప్రతిష్ఠింప బడవలెనని నాసంకల్పము.

తుషార:- మీసంకల్పము అమోఘము.

క్షితీంద్ర:- అగియే కాదు. నీవు విశ్వవిద్యాలయమువారిచే "కళాప్రపూర్ణ" యని గౌరవబిరుదమునుగూడ పొందవలెను. నాఅల్లుఁడు సంస్థానాధీశుఁడేగాక కళాప్రపూర్ణుఁడు గూడ కావలయును.

తుషారకాంతిరాయులకు నవ్వువచ్చెను. అతఁడు అపుకొనజాలక పోయెను.

క్షితీంద్ర:- ఏల నవ్వుచున్నావు?

తుషార:- ఏమియునులేదు. నేనెన్నఁడును దలంపని విషయములు తటస్థములగుచున్నవి. నన్ను మీరాశ్చర్యపరవశునిగాఁ జేయుచున్నారు.

క్షితీంద్ర:- అవును. నాకుకళలన్న ఎంతోయిష్టము. నేనెల్లప్పుడును సౌందర్య దేవత నుపాసింతును. శిల్పసంపదకు నెలవైన చిత్రములను వస్తువులను సేకరించుటలోచాల ధనమును వ్యయముచేసినాను.

తుషార:- మీరు సేకరించిన వస్తువులు అమూల్యములని విన్నాను.

క్షితీంద్ర:- వానిలో ముఖ్యమునైనదియు ననన్యదుర్లభమగునదియునగు అశోకునికిరీటమును నీవు చూడలేదు. దానివెల సులభముగా ఈనాఁడు ఏఁబదిలక్షలు.

తుషార:- నేనునట్లే వింటిని. అందులకే దండధరుఁడు దానిమీఁద కన్నువైచి నాఁడు.

క్షితీంద్రుఁ డదరిపడియెను.

"ఆదుర్మార్గుని పేరెత్తకుము" అని ఆతఁడు గర్జించెను.

తుషార:- జయంతిశ్రీ నాకాతని యుత్తరము చూపించినది. చిత్రముగా నున్నది.

క్షితీంద్ర:- వాని ఉత్తరమా! కిరాతకుఁడు! నాకు మూర్ఛవచ్చినంతపని యైనది. నేనీ మందిరములోనే కూర్చుండియుంటిని మేమేదో విషయములు ప్రాస్తావికముగాఁ జెప్పుకొనుచుంటిమి. ఆకస్మికముగా బదరివచ్చి ఒక ఉత్తరమును చేతికిచ్చినాఁడు.

ఇంతలో ద్వారము తెఱచినశబ్దమయ్యెను. బదరి లోనికి నెమ్మదిగావచ్చి "స్వామీ! మీకొక ఉత్తరము వచ్చినది." అని దానిని క్షితీంద్రునిచేత కొసంగెను.

క్షితీంద్రుఁడు దాని నందుకొనియెను. అతఁడు సులోచనములను దీసి పెట్టుకొనుచు "ఇట్లే ఆనాఁడును ఉత్తరము వచ్చినది. దానిపై గస్తూరీ— "అని పై చేతిలోనున్న కవరుపైగల అక్షరములను జూచి "మరల కొంప మునిగినది." అని కేకవైచెను.

రాయలు:- ఏమైనది? అని తనకుర్చీలోనుండి ముందఱికుఱికెను.

క్షితీంద్రు:- అదియేదస్తూరీ. ఆనాఁటి 'కవరు' పైఁగల దస్తూరీయే యీ 'కవరు' మీఁదకూడ నున్నది. అని అతఁడు సర్వశక్తు లుడిగినవానివలె కుర్చీలో వెనుకకుఁ బడిపోయెను.

కుమార:- ఇదిమీభ్రమ.

క్షితీంద్రు:- కాదు. కాదు. అదియే దస్తూరీ. సందేహములేదు. నాకింకను మఱపోలేదు.

అని అతఁడా కవరును వణఁకుచున్న చేతులతోఁ జింపి ఉత్తరమును దీసి దానివంక నొకసారి చూచెను. తరువాత బిగ్గఱగా నిట్లుచదివెను.

"అయ్యా!

నేను సేకరింపఁదలఁచికొనిన చిత్రములలోఁ గొన్ని మాత్రమే దొఱికినవి. తక్కినవెన్నియో మీతావున అలహాబాదునగరములోని భవనములో గలవు. అవి మీదగ్గఱ గుప్తముగానుండుట దేశమునకు సిగ్గుచేటు. వానిని రేపు ఉదయము మీనగర భవనములోనుండి కృతజ్ఞతాపూర్వకముగాఁ దీసికొని పోవుచున్నాను. విధేయుఁడు,

దండధర తులసీదాసు."

"అతఁడు బెదరించుచున్నాఁడు" అని రాయలు పలికెను.

"ఉండుము. క్రింద కొంత వ్రాసినాఁడు. వినుము."

"తా॥జా॥కలం:- అశోకచక్రవర్తి కిరీటమును నేనుకోరినతరువాత మూఁడు సంవత్సరములనుండి తమరే దాఁచుకొని యుంచుకొన్నారు కాబట్టి ఆ ఆభరణమునుగూడ తీసికొనియెదను. ద.తు."

"దొంగ! మాయావి! మృత్యు! అయ్యో; నాకు ఊపిరి సలుపుటలేదు." అని క్షితీంద్రుఁడు కంఠమును సవరించుకొనఁ దొడఁగెను. అతని ముఖము నల్లవడియెను. అతఁడు వివశుఁడైలేచి ఒక సోఫాలో బాధపడుచు పండు కొనియెను.

అతనికి నిజముగా నూపిరాడుటలేదని అప్పటి అవస్థ ఘోషపఱచు చుండెను.

"బదరీ! బదరీ! ఒక గ్లాసెడు మంచినీరు తీసికొని రమ్ము! త్వరగా తేవలెను. మీయజమానికి సుస్తీగానున్నది." అని రాయలు కేకవైచెను. అతఁడు క్షితీంద్రుని సమీపించి మీఁద చేయివైచెను.

క్షితీంద్ర: తుసారా! వెంటనే టెలిఫోనులో పరిశోధకశాఖాధికారికిఁ దెలియఁ జేయుము. త్వరపడవలెను. అని అతికష్టముతో నూపిరి పీల్చికొనుచు బలికెను.

రాయలు క్షితీంద్రుని దుస్తుల బొత్తాములను శీఘ్రముగా నూడదీసెను. గోడకు దగిలించియున్న వీవనను దీసికొని విసరఁజొచ్చెను. బదరి మంచినీరు తీసికొనివచ్చెను. ప్రక్కనున్న గదిలోనుండి జయంతశ్రీయును, సుమబాల యును పరుగు పరుగునవచ్చిరి.

"త్వరగా! లవణములసీసా తెమ్ము" అని రాయలాజ్ఞాపించెను.

సుమబాల పరుగెత్తుకొనిపోయి ఒక అలమారలోని డ్రాయరు తెఱచి ఒకసీసాను గొనివచ్చెను. రాయలు దానినందుకొని మూతతెరచి క్షితీంద్రుని. ముక్కుదగ్గఱ నుంచెను ఆలవణముల ఘాటుకు క్షితీంద్రుడు మూడు తుమ్ములు తుమ్మెను. రాయలు బదరిచేతిలోని మంచనీళ్ల గ్లాసునందుకొని క్షితీంద్రుని ముఖముపై చల్లని నీరమును నెమ్మదిగా చిల్కరించెను. అతఁడు కొంతతడవునకు తెప్పిఱిల్లెను. జయంతిశ్రీ దిగులుపడి తండ్రివంక నిశ్చేష్టయై చూచుచుండెను.

"కారణమేమి ?" అని యొట్టకేల కామె ప్రశ్నించెను.

"ఇదుగో! ఈఉత్తరము దండధరనుండి వచ్చినది"అని రాయలు బదులు పలికెను.

"నేను తమకు జెప్పలేదా? దండధరుఁడీప్రాంతములలోనే మెలగుచు న్నాడు."

క్షితీంద్రుడు లేచి కూర్చుని "బదరీ ! ఏఁడీవాడు? ఓరీ! యిటుగా! ఈ ఉత్తరము! ఎక్కడినుండి వచ్చినది ? ఎవరు తీసికొనివచ్చినారు?" అని ఆతురతతోఁ బ్రశ్నించెను.

"ఇది ఉత్తరములపెట్టెలో నున్నది." అని బదరి చెప్పెను.

"అవును. వెనుకగూడ నిట్లేజరిగినది. మరల నదియే పన్నాగము. అయ్యో! ఏమిశని చుట్టుకొన్నది!" అని క్షితీంద్రుఁడు నిర్వేదముతోఁ బలికెను. దుర్భర తాపవేగమున తనచేతులతోఁ దలవెండ్రుకలను సమూలములుగా నిర్మూలనము చేయుటకుఁ బూనుకొనెను. కాని అతనిది సంపూర్ణముగా బట్టతలయగుటచే నది సాధ్యముగాకపోయెను.

రాయలాతని చర్యలుచూచి "మహాశయా! మీరధైర్యపడి లాభములేదు. ఈఉత్తరము వట్టిబోకరింపు—" అని చెప్పఁగనే

క్షితీంద్రుడు:- బోకరింపా! మూఁడేండ్లక్రిందట నేమైనది?

రాయలు:- మంచిది. ఈచౌర్యము నిజముగా సంకల్పింపఁబడినదేని ఈఉత్తరము నమ్మఁదగినదికాదు.

క్షితీంద్రు:- ఎందుచేత?

రాయలు:- ఈఉత్తరము తేదీ చూడుఁడు. 'ఆదివారము. సెప్టెంబరు 3'— ఇది నేఁటిదినమే వ్రాయఁబడినది.

క్షితీంద్రు: అవును. అయిన నేమి?

రాయలు: ఇందులోని విషయమును గమనింపుఁడు.— వానిని రేపుఉదయము మీనగర భవనములోనుండి కృతజ్ఞతాపూర్వకముగాఁ దీసికొని పోవుచున్నాను.—"

క్షితీంద్రు: అవును. రేపు ఉదయమే! మఱి-నీ అభిప్రాయమేమి?

రాయలు:- అదియొక బెదరింపు. అట్లగుచో దానిని మనము లక్ష్యపెట్ట నక్కఱలేదు. ఒకవేళ నిజమేయగునేని మనము చౌర్యమును వారింపదగిన అవకాశమున్నది. ఈరెంటిలో నేదియో యొకటి నిశ్చయించుకొనవలెను.

క్షితీంద్రు: అవును. మనకవకాశమున్నది. ఏదీ ! నన్ను టెలిఫోనుదగ్గరకు దీసికొనిపొండు.

సుమబాల:- టెలిఫోను లాభములేదు. అని చటుక్కున బలికెను.

క్షితీంద్ర:- ఏమి? ఎందులకు?

సుమబాల:- వేళ యతిక్రమించినది. ఆదివారము నాఁడు 'టెలిఫోను' ఇంత ప్రొద్దుపోవువఱకు నిచ్చోట పనిచేయదు.

క్షితీంద్ర:- నిజమే! ఏమి చేయనగును?

జయంతశ్రీ:- ఏమియు విచార పడవలదు. 'టెలిగ్రాము' పంపవచ్చును.

సుమబాల:- దానికి వీలులేదు. ఆదివారము పండ్రెండు గంటలకే తంతికార్యాలయమును మూసివైచెదరు.

క్షితీంద్ర:- ఏమి ప్రభుత్వము! తంతి! తపాల పనులాగిపోవుట యిదివఱకెన్నఁడు నెఱుఁగము. అని అతఁడు 'టెలిఫోను ప్రక్క కుర్చీలోఁ గూలఁబడెను. అతని శిరః ప్రదేశమున నవిరళముగా స్వేదబిందువు లుత్పన్నము లగుచుండెను.

రాయలు:- ఇంతమాత్రమున పోయిన దేమియులేదు. ఎట్లో యీకష్టమునుండి కడతేఱు నుపాయము చూడవలెను.

క్షితీంద్ర:- ఏఉపాయము?

రాయలు బదులాడలేదు. అతఁడు కోటుజేబులలోఁ చేతులుపెట్టుకొని ఆహాలులోఁ నిటు నటు నడయాడసాగెను. జయంతశ్రీ ఒక కుర్చీలోఁ గూర్చుండెను. సుమబాల ఒక సోఫానానుకొని ముందటికి వంగి నిలువబడియుండెను. బదరి యజమాని చేతికందకుండ దూరమున ద్వారముకడ నుండెను. క్లిష్ట పరిస్థితిని బరిష్కరించుట కుపాయ మాలోచించుచున్న రాయలేమి చెప్పునో యని వారందఱు నుద్వేగ హృదయులై కనిపెట్టుకొని యుండిరి.

ఎట్టకేలకు రాయలు "దొఱకినది. ఉపాయము దొఱకినది." అని అఱచెను.

క్షితీంద్రుఁడు దిగ్గునలేచి హాలుమధ్యకువచ్చి "ఏమిటది?" అని ఆతురతతోఁ బ్రశ్నించెను.

"వేళ ఎంత ఐనది?" అని రాయలు తనచేతి గడియారమును జూచికొనియెను.

క్షితీంద్రుఁడు తనజేబు గడియారమును బైకిలాగెను. జయంతశ్రీ తనచేతి గడియారమును జూచెను. ఒక దాని కొకటి సరిపోవలేదు. చివరకు రాయలు ఏడున్నర గంటలైనట్లు నిర్ణయించెను.

రాయలు:- ఇప్పుడు పీడున్నర మాత్రమే అయినది. నేను కారుతీసికొని అలహాబాదు నగరమున కిప్పుడే పోయెదను. నేనీరాత్రికే చేరి యీ విషయము పోలీసు వారికిఁ దెలియఁజేసి చౌర్యము జరుగుచుండఁగానే సకాలములో దొంగలను బట్టుకొను సేర్పాటులు చేసెదను. నాప్రయాణమునకుఁ గావలసిన వస్తువులను దీసికొనియెదను. అని అతఁడు హాలు వదలి లోపలికిఁ బోయెను.

"బలే బాగుగానున్నది." అని క్షితీంద్రుఁడు కుమార్తెవంక కుఁదిరిగి "నీప్రియుఁడు ఉపాయ శాలియే! నేనుకూడ అలహాబాదుకు పోయెదను. నీవు కూడ నాతోరమ్ము. ప్రాణసంరక్షణార్థమై నేనిక్కడ బడియుండఁ జాలను. అదియునుగాక నిన్నిక్కడ విడిచి పెట్టజాలను. ఆ దుర్మార్గుఁడు ఈ దుర్గము మీఁదికి దాడి వెడలినను వెడల వచ్చును. ఇక్కడఁపోవున దేమియును లేదు. అయినను- ఆ వెండి విగ్రహముచోటులు మార్చుచున్నది. గవాక్షము అద్దము కోసి వేయబడినది. ఇద్దఱుఁడు పిల్లలను దొంగలకు వదలివైచి నేనొక్కఁడను బోవజాలను. మన రెండు కారులలో మనకుఁ గావలసినంత స్థలమున్నది." అని పలికెను.

జయంతశ్రీ:- నాన్నగారూ! నాకిది బాగుగాలేదు. మనము నేవకులకంటె ముందె చేరఁగలము. అర్థరాత్రివేళ శూన్యగృహములో నొంటరిగా ప్రవేశించుట క్షేమకరమగునా?

క్షితీంద్రుడు: నీదంతయు ఛాందసము. త్వరగాఁ బోయి సిద్ధ పడుము. నాతాళపు జేతులు. సుమబాలా! అలహాబాదు భవనపు తాళపు చేతులు ఎక్కడ నున్నవి?

సుమబాల:- అవి బీరువాలో నున్నవి.

క్షితీంద్రుఁ:- వానిని జాగ్రత్త చేయుము. నీవుకూడా సిద్ధమగుము. బదరీ! రెండు కార్లను సిద్ధము చేయుమని కిషన్ సింగుతో చెప్పుము. నే నొకటి నడపెదను. రెండవ దానిని తుషారకాంతుఁడు నడుపఁ గలఁడు. కిషన్‌సింగు నీతోఁబాటు ఇక్కడనే యుండి యీభవనమును సంరక్షించు చుండవలెను.

క్షితీంద్రుఁడా బాలికలను వారిగదులలోనికిఁ బంపి తొందర జేయుచు దానును ఆమందిరమును వీడి లోనికిఁ బోయెను.

## ౬

# మరల సుజీవరులు.

క్షితీంద్రుఁడు మందిరమును దాఁటఁగనే వృద్ధసుజీవరుని ముఖము వరాండాలోని గవాక్షము కడ పైకి లేచెను. ఆతఁడా శూన్యమందిరము నలుదిక్కులను గలయఁజూచి మెల్లగానొక సన్నని యీలవైచి లోనికిఁ బ్రవేశించెను. పదిక్షణములలో నాతని కొడుకులు ముప్వురును గవాక్షములగుండ లోనికి వచ్చిరి. వారితోఁబాటు కోటేశ్వరుఁడగు క్షితీంద్రుని 'కారుడ్రైవరు' కిషన్ సింగుకూడవచ్చెను. వృద్ధసుజీవరుఁడు హీనస్వరముతో "కిషన్ సింగ్! నీవు వెలుపల హాలులోనికిఁబోవు ద్వారమునొద్దనుండుము. మోతీ నీవాద్వారము నుండి 'డ్రాయింగురూము'ను జేరుము. ఓరీ! మీరిరువురు డ్రాయరుల సొరుగులను వెదకుటకుఁ దోడ్పడుఁడు" అని వారివారి కార్యములను నిర్దేశించెను. తరువాత నాతఁడు "వారందరు అలహాబాదుకు పోవుచున్నారు. మనము త్వరపడమేని కార్లుచిక్కవు." అని హెచ్చరించెను.

"ఇది అంతయు నాతఁడు వ్రాసిన ఉత్తరమూలమున వచ్చినచిక్కు. ముందుగాఁజెప్పకాని చేయనని ఆతనిప్రతిజ్ఞ. ఈ ఉత్తరము వ్రాయకుండిన యెడల నగరములోని భవనమును కొల్లగొట్టుట యెంతతేలికగా నుండెడిది" అని కిషన్ సింగ్ నెమ్మదిగా గొణుగుకొనెను.

"ఓరీ! మూర్ఖుఁడా! ఆఉత్తరమువలన వచ్చిననష్టమేమున్నది? నేఁడు ఆదివారము. రేపటికిగదా మనకు కిరీటము స్వాధీనము గావలసినది! అది నగరములోనే యుండవచ్చును. దానికొఱకు ఈ భవన మంతయు గాలించుచున్నాను." అని వృద్ధసుజీవరుఁ డనెను.

కిషన్ సింగ్ వెలుపలిహాలు తలుపు లరయంగుళము మేరకు తెఱచి యనిమేషదృష్టులతోఁ జూడసాగెను. 'డ్రాయింగురూము' ద్వారముకడ మోతీయును నట్లే చూచుచుండెను. వృద్ధుఁడును, తక్కిన కొడుకులిరువురును ఆ విశాలమందిరములోని డ్రాయరులన్నింటిని సాంగముగా వెదకుచుండిరి. వారి అన్వేషణ మతిత్వరితముగను నిశ్శబ్దముగను జరిగిపోవుచుండెను,

"బీరువా? ఏ బీరువా? ఈ హాల్లంతయును బీరువాలమయమై యున్నది. నాకు దాని తాళపుచేతులు కావలయును." అని వృద్ధుఁడు హుంకరించెను.

"అదిగో! ఎడమవైపున ఇత్తడిపిడులు గలవి. అద్దముశేషమంతా సొరుగు చెక్కబీరువా." అని మోతీ నిర్దేశించి చెప్పెను.

"ఈవివరము లింతాకనే చెప్పకూడదా?" అని ఆ వృద్ధుఁడు గొణగొణలాడుచు దానిని జేరఁబోయెను. వెంటనే దానిని దెఱమటకుఁ బ్రయత్నించెను కాని అది తాళమువేయఁబడి యుండెను.

"అవును. తాళమువైచినారు. ఓరీ!" అని తనకుమారులలో నొక్కని బిలచి "బహదూర్! దీనిని తెఱువుము." అని చెప్పెను.

బహదూర్ త్వరితముగా నాబీరువాను సమీపించి మరమేకువంటి దీగముతో దానిని తెఱచెను. అంత తండ్రికొడుకు లిరువురును గలసి దానిలోని సొరుగులన్నింటిని లాగి వెదుక నారంభించిరి.

"త్వరగా! త్వరగా! ముసలివాఁడు వచ్చుచున్నాడు." అని కిషన్ సింగు హెచ్చరించెను. అతఁడు ఆవలికిఁబోవుచు నాహాలులోనున్న రెండు దీపములలో నొకదాని నార్పివైచెను. ఏడవ సొరుగులో వృద్ధసుజీవరునకుఁ దాళపుచేతులగుత్తి కానవచ్చెను. అతఁడు దానిని తీసికొని దానికి బదులు మఱొక తాళపుచేతుల గుత్తిని తన జేబులోనుండితీసి ఆసొరుగులో నదేస్థానమున నుంచెను. తరువాత ఆసొరుగును మూసి బీరువాకు తాళమువైచి గవాక్షమునొద్దకు బరుగెత్తెను. కిషన్ సింగును అతనికుమారులును అంతకుపూర్వమే హాలువీడి వెలుపలికిఁ బోయియుండిరి.

ఆమందిరము ద్వారమును దెఱచుకొని క్షితీంద్రుఁడు లోనికి వచ్చుసరికి వృద్ధసుజీవరుఁడు గవాక్షమునకింకను గజముదూరములో నుండెను. గవాక్షము గుండ మాయమగుచున్న అతనివీపును క్షిత్రీంద్రుఁడు చూచెను. వెంటనే అతఁడు "ఎవరువారు? ఎవఁడోదొంగ! పట్టుకొనుఁడు! బదరీ! బదరీ!"అని కేకలు పెట్టుచు నాగవాక్షమువంకనే దృష్టినుంచి ఆ మందిరములో నీమూలనుండి ఆ మూలకు బరుగెత్తెను. అమితాంతోళనమున మధ్యలో తనదారికడ్డముగానున్న బల్లలను కుర్చీలను అతఁడు చూడలేదు. ఇంతకుఁబూర్వము తాను పండుకొని యున్న పడకకుర్చీ అతని కాళ్లకుఁ దగిలెను. అతఁడువ్రేత్తున నాకుర్చీమీద నడ్డముగాబోరగిలబడి మరలవెంటనే లేవలేకపోయెను. అతనికాళ్లకు చేతులకు దెబ్బలుతగిలెను. అతఁడు బాధపడుచు నిమ్మళముగా లేచికూర్చుండి చిన్నపిల్లవానివలెఁ గన్నీళ్లుకార్చుచుఁ గొంతతడవు రోదనముచేసెను. తరువాత ఏడ్పు

చాలించి గొంతెత్తి బిగ్గఱగా "బదరీ! బదరీ! తుషారకాంతా! తుషారకాంతా!" అని పిలచెను.

అతఁడతి కష్టముతో లేచి కుంటుపడిన నడకతో గవాక్షమును జేరి యావరణమంతయుఁ గలయఁజూచుచు "బదరీ! తుషారకాంతా!" అని మరల బిగ్గఱగా బిలచెను. ఎవ్వరును బలుకలేదు. అతనికి భయమధికమయ్యెను. వెనుకనుండి యెవరైనను వచ్చి గొంతుక కోయుదురేమోయని తలంచుకొనుచు వడఁకిపోవుచుండెను. అతఁడు లేనిధైర్యమును దెచ్చుకొని మరల "బదరీ! తుషారా!"అని కేకలువైచెను.

తుషారకాంతరాయ లామందిరములోనికి శాంతముగాఁ బ్రవేశించెను. అతఁడొకబరువైన మోటారుకోటును, మోటారుటోపీని ధరించి, చేతిలో నొక తోలుసంచిని పట్టుకొని ప్రయాణమునకు సిద్ధమైవచ్చెను. వచ్చుచునే "నన్ను మీరు పిలచినారా?" యని ప్రశ్నించెను.

క్షితీంద్రు:- పిలచుటేమి? నెత్తిన నోరుపెట్టుకొని మొత్తుకొనుచున్నాను. దొంగలే మందిరములోనికిఁ బ్రవేశించినారు. వారిలో నొకఁడు పాఱి పోవుచుండఁగా నేను చూచినాను. వాఁడా మధ్య గవాక్షము గుండ దుమికినాఁడు.

రాయలు కనుబొమలెత్తి "ఇదియంతయు భ్రమ. నరముల దౌర్బల్యము." అని చప్పరించుచుఁ బలికెను.

క్షితీంద్రు : నరముల దౌర్బల్యమా నాపిండకూడా? నేను దొంగను ప్రత్యక్షముగాఁ జూచితిననఁగా నమ్మరేమి?

రాయలు : ఏమి చూచినారు? ఎకరము మేర హాలులో నొక దీపమును వెలిగించిపెట్టి మీరేమి చూడఁగలరు?

క్షితీంద్రు : వాఁడు! ఆమతిలేని బదరి! పరమమూర్ఖుడు! కనీసము ఆఱు దీపములైనను వెలిగించవలసినది! బదరీ! బదరీ!

బదరి వచ్చునని వారునిరీక్షించిరి. కాని వాఁడురాలేదు. ఇంకనువాఁడు కార్లవిషయమై యజమాని ఆజ్ఞలను కిషన్‌సింగుకు చెప్పుచున్నాఁడేమో!

"మనము గవాక్షములన్నింటిని మూసివేయుదము" అని రాయలనుచు నొక్కొకదానిని మూసివేయఁదొడఁగెను.

"మీకు బదరి యుపయోగపడునో వాని నీరాత్రి కీహాలులో నొక తుపాకితోసహ కాపుంచుటమంచిది. ఒక్క బదరీ సహాయముతో ఘనుమ్మలను ఈపెద్దభవనములో విడిచిపోవుట నాకిష్టములేదు" అని రాయలుపలికెను.

క్షితీంద్రి: నాకుఁగూడ ఇష్టములేదు. నేనుగూడ నీతోఁబాటు అలహాబాదుకు మోటారులో వచ్చెదను. బదరీ! తోడుగా కిషన్‌సింగ్ ఉండి వారిరువురు దొంగల నెదురొక్కనగలరు. బదరి గతయుద్ధములో పనిచేసి వచ్చినాఁడు.

రాయలు : మీరుకూడ అలహాబాదుకు వచ్చుచున్నందులకు నాకు చాల ఉత్సాహముగ నున్నది. నామనస్సులోని భాగమంతయు నీసిస్తైచి నట్లున్నది. నేను త్వరగా ముందుపోయెదను. మీరును జయంతశ్రీ కలసి నెమ్మదిగా వెనుకరండు. నేనెంత త్వరగాఁబోయిన నంత శ్రేయస్కరము. నావెంట సుమబాలనుగాని ఊర్మిళనుగాని తీసికొని పోయెదను.

క్షితీంద్రి : లేదు. నేను జయంతశ్రీని, ఊర్మిళను దీసికొనిపోయెదను. ఊర్మిళ లేనిది జయంతశ్రీకి కాలముగడువదు.

ఆవలిగది ద్వారమును దెఱచుకొని ఊర్మిళా సుమబాలలతోఁ గలసి జయంతశ్రీ వచ్చెను. వారు మోటారులో కూర్చుండుటకుఁ దగిన గౌనులను, టోపీలను ధరించియుండిరి. వారిచేతులలో తోలుసంచులు కూడ నుండెను.

జయంతశ్రీ : ఈ అర్ధరాత్రివేళ నీప్రయాణమేమి? నాకు ఎంతమాత్రమును ఇష్టములేదు.

క్షితీంద్రి : ఇష్టములేదా ? నీకుఁ దెలియదు కాఁబోలు ! ఇప్పుడే యిక్కడనే నేనొక దొంగను జూచితిని. నారాకవలన బెదరి ఆగవాక్షముగుండ పాఱిపోయినాఁడు.

రాయలు : వానిమొగము మసిబూసిన మారేడుకాయవలె నున్నది.

జయంతశ్రీ : మీపరిహాసముల కిదియా సమయము !

రాయలు : ఈమందిరములో చాలీచాలని వెలుతురులో వానిమొగము మీనాయనగారి కావిధముగా గనబడినది. బాగుగా వెలుతురుండిన యెడల వానిమొగము సుద్దముక్కవలె నుండెడిది.

క్షితీంద్ర:- తుషార కాంతా! నీవు కళాపరిపూర్ణుఁడవు కాఁగోరినయెడల నిట్లు" మాటల్లాడుట మానుకొన వలయును. నేను ఒక దొంగను జూచిన మాట వాస్తవము.

రాయలు:- వాస్తవమే కావచ్చును. కాని వాని రంగునుగుఱించి నేను చెప్పు చున్నాను.

జయంతశ్రీ:- మీ చమత్కారములు చాలింపుఁడు. వానితో విసుఁగుపుట్టి మేమందఱము చచ్చిపోవుచున్నాము.

క్షితీంద్ర:- దేనికైనను సమయాసమయము లున్నవి. నా అమూల్య వస్తు సముదాయము-నా అశోక చక్రవర్తి మాణిక్యవిరాజిత కిరీటము-అంతర్హితము లగుచుండగా నీ పరిహాస భాషణము లప్రస్తుతములు.

రాయలు:- క్షమింపుఁడు. అని అతఁడు సుమబాల వంకఁజూచి చిఱునవ్వు నవ్వెను.

క్షితీంద్ర:- సుమబాలా! బీగములు-నగరములోని భవనపు బీగములు-

సుమబాల తన తావుననున్న తాళపుఁజేతులను దీసికొని బీరువాను సమీపించి దాని తాళమును దెఱచుటకు బీగమును త్రిప్పెను. అదితిరుగలేదు. ఆమె వంగి దానిని పరీక్షించెను.

"అయ్యో! ఈ తాళమునెవరో బద్దలు కొట్టినారు!" అని ఆమె కేక వైచెను.

క్షితీంద్ర:- నేను చెప్పలేదా ఒక దొంగ యిక్కడ ప్రవేశించినాఁడని! వాఁడా తాళపు చేతులకొఱకే దేవులాడుచుండెను.

సుమబాల బీరువాను దెఱచి సొరుగునులాగి చూచెను. దానిలో బీగములగుత్తి అగపడియెను.

సుమబాల:- ఇవిగో! తాళపుఁజేతు లిక్కడనే యున్నవి! అని వాని నామె యెత్తి చూపించెను.

క్షితీంద్ర:- నేను సమయమునకు వచ్చితిని. వాఁడు వానినెత్తుకొని పోవుటకు వెదకుచుండగా బెదరఁగొట్టితిని.

రాయలు:- మీరు నిజముగానే ఒక దొంగను జూచినారని నేనిపు డొప్పుకొనుచున్నాను. కాని వాని రంగును గుఱించిన సందేహము కొంచెము బాధించుచున్నది. దొంగ లెప్పుడును నల్లగానే యుందురు. సరే. దానికేమి! సుమబాలా! ఆ తాళపుఁజేతులను నా కిమ్ము! నేను ముందుగా అలహాబాదు నగరమునకుఁ బోవుచున్నాను.

సుమబాల వానిని రాయల కొసంగెను. అతఁడామెహస్తమును తాళపుజేరులతో సహా పట్టుకొని మృదులముగ స్పృశించి వదలిపెట్టెను. సుమబాల ముఖము తెల్లస్ఫటికమువలెఁ గందిపోయెను. కాని ఆ గుడ్డివెలుఁగులో నెవ్వరును గమనింపలేకపోయిరి. ఆమె వెనుదిరిగిపోయి బీరువాకు ప్రక్కగా నిలువఁబడెను.

జయంతిశ్రీ:- నాన్నగారూ! మీరీ చలిగాలిలో ఆ సన్నని కోటుతోడనే మోటారులో ప్రయాణము చేసెదరా! ఎప్పుడును మేము ప్రయాణమైన తరువాత అరగంట ఆలస్యము చేయుట మీకలవాటైపోయినది. మీయిష్టము మీరేమైన జేసికొనుఁడు. మేము బయలుదేరిపోయెదము.

క్షితీంద్రుఁడు పరుగు పరుగున లోనికిఁబోయెను. విసుగుదలతో జయంతిశ్రీ ఒక కుర్చీలోఁ గూర్చుండెను. ఊర్మిళగది వాకిట నిలుచుండెను. సుమబాల బీరువా నానుకొని క్రిందఁగూలఁబడియెను.

వర్షపుజినుకులు గవాక్షముల అద్దములకుఁ జిటపట గొట్టుకొనదొడంగెను.

జయంతిశ్రీ:- అదిగో! వర్షము! ఇది ఒక్కటియే యీ సమయమునకుఁ గొఱఁతగా నుండెను. అదికూడ తీఱినది.

రాయలు:- ఏసమయమునను కారుతగా సరిపుచ్చుకొనవలెను. ఇప్పుడు నీకేమి యిబ్బందికలిగినది? వస్త్రులన్నియు బందోబస్తుగానే ధరించినావుగదా! కొంతతడవు వారందఱు నిశ్శబ్దముగా గూర్చుండిరి. టపటపమని చినుకులధ్వని సాగుచునే యుండెను. రాయలొక సిగరెటును తీసి వెలిగించెను.

ఆకస్మికముగా నాతనికి ఉత్సాహము చెలరేగెను. ముఖము వికసించెను. సంతోషముతో "నాకీయూహ ఎందులకు పొడమలేదు? ఈ అంధకార కూపమునుండి మనమేల బయలుదేఱవలయును? మనము చేయఁబోవు శుభకార్యమునకుఁ దగినట్లుగా నీమందిరమును దీప్తివంతముగాఁ జేయుదము" అని పలుకుచు నాతఁడా మందిరములోనున్న దీపములన్నింటిని వెలిగింపఁజొచ్చెను. స్తంభములమీఁద దీపములు- కొక్కెములకున్న దీపములు- బల్లపైనున్న దీపములు- వ్రేలాడుచున్న దీపములు- పురాతనకాలపు దీపములు- నాగరికపు క్రొత్తదీపములు- ఇత్తడి దీపములు- వెండి దీపములు-

కాచపాత్రల దీపములు- ఎన్నియో ఆమందిరములో నలంకారపాత్రముగా నుండెను. వానినన్నింటి నొకదానివెనుక నింకొకదానిని క్రమముగా ఓపికతో నొక్కటినిగూడ బీగపోనీయక అతఁడు వెలిగించెను. అతఁ డొక్కొక్క దీపమును వెలిగించునపు డొక్కొక్కవిధముగా జయంతశ్రీ మెచ్చుకొనుచుండెను. ఆమె మెచ్చుకోలులో నాతఁడంత మూర్ఖుఁ డెంతులకు తనకు దాపురించెనో యనుభావము ప్రస్ఫుట మగుచుండెను. రాయలామెను లక్ష్య పెట్టలేదు. ఒక్కొక్క దీపము వెలిగించి అతఁడు ముగ్ధబాలకునివలె మురిసిపోవుచుండెను. అతని ముఖము ఆనంద తేజోవిరాజ మానమయ్యెను.

సుమబాల రాయల ముఖములోని ముగ్ధమోహనమగు ఆనంద తేజమును పూజ్యదృక్కులతో దిలకించుచుండెను.

క్షితీంద్రుఁడు ఆ మందిరములోనికిఁ బ్రవేశించెను. అది పట్టపగటివలె జేగీయమానముగాఁ బ్రకాశించుచుండెను.

"తుషారా! ఇదియేమి?" అని అతఁడట్లే ఆఁగిపోయెను. అతని దృష్టి లాదీపములవంక నిలిచిపోయెను.

జయంతశ్రీ:- ఇది ఒక దివ్యలీల. అని ఆమె వికటముగా నవ్వెను.

క్షితీంద్ర:- తుషారా! ఎంతచముర ఖర్చు చేయుచున్నావు? ఏదియో కార్యము పట్లతప్పఁ దక్కిన సమయములలో నాలుదీపములను మించి యెన్నఁడును వెలిగించి యెఱుఁగము.

రాయలు:- చూడుఁడు! ఈ మందిర మిపుడెంత శోభావంతముగఁ బ్రకాశించుచున్నదో!

అని నలువైపులను దిలకించుచు పలికెను. ఏదియో జ్ఞాపకము వచ్చినవానివలె క్షితీంద్రునివైపు తిరిగి "ఏవీ మోటారుకారులు? వానిని దీసికొని వచ్చుటకు కిషన్‌సింగుపోయి ఏజామైనది? ఈవానలో మనము తడిసికొనుచు శకట శాలలకడకు పోవలయునా యేమి? మనము వానిని తొందర చేయవలయును. రండు. మీగొంతు పెద్దది." అని క్షితీంద్రుని చేయి పట్టుకొని హాలుగుండా లాగికొనుచు వరండాలోనికిఁ దీసికొనిపోయి "కేక వేయుఁడు!" అనియెను.

క్షితీంద్రుఁడు రాయల మొగమునుజూచి యేమియు ననజాలక బిగ్గఱగా "బదరీ! బదరీ! కిషన్‌సింగ్! కిషన్‌సింగ్" అని కేకలువైచెను.

ఎవ్వరును బలుకలేదు.

## ౭

# శకటాపహరణము

జగమంతయును కాటుక పూయబడినట్లు గాఢాంధకార మలము కొనియెను. వర్షపుజల్లువారి ముఖములపైఁ బడుచుండెను.

మరల మరల క్షితీంద్రుఁడు కిషన్‌సింగ్! బదరీ! బదరీ! కిషన్‌సింగ్! అని గర్జించుచుండెను.

ఆ గాఢాంధకారమునుండి యెట్టి ప్రత్యుత్తరమును రాలేదు. అతఁడు వెనుకకుఁదిరిగి రాయల వంకఁజూచుచు "వీరేమైపోయినారు? ఏమిచేయు చున్నట్లు?" అని అస్థిమితమనస్కుఁడై పలికెను.

రాయలు:- నాకేమియు నర్థమగుటలేదు. మనము పోయి వారిని వెదకి తీసి కొని రావలసినదే!

క్షితీంద్రు:- ఏమిటీ? ఇంటికి నలుప్రక్కలను దొంగలను బెట్టుకొని ఈచీఁకటి లోనా? అని అతఁడు బెదరిపడియెను.

రాయలు:- మనము పోనిచో పోవువారెవ్వరును లేరు. ఆలస్యమగుచున్నకొలఁదియు నా దుర్భాగ్యుఁడు. దండధరుఁడు నీ అమూల్యవస్తువులను సమీపించుచున్నాఁడు. కాఁబట్టి నడుముగట్టి త్వరపడుము.

రాయలు క్షితీంద్రుని చేయిపట్టుకొని మెట్లమీఁదుగాఁ గ్రిందికి దింపెను. వారా అంధకారములో శకటశాలను సమీపించిరి. అక్కడనొక మసిపట్టిన గుడ్డిలాంతరు వెలుఁగుచుండెను. రాయలు లాంతరు చేఁబూని శకటశాలలోనికిఁబోయి వచ్చి "ఇది ఏమి దౌర్భాగ్యము." అని కేకవైచెను.

శకటశాలలో మూఁడు మోటారుకారులకు బదులు నూరు "హార్సు పవరు" గల ఒక్క మోటారుకారు మాత్రమే యుండెను. అది పందెములలో విలాసముగా నుపయోగించునది. దానిలో నిరువురు మాత్రమే కూర్చుండుటకు స్థానములుండెను. ఆ స్థానములలో కిషన్‌సింగును బదరీయును గూర్చుని యుండిరి.

"ఓరీ! పశువులారా! ఇక్కడ కూర్చుండి ఏమి యేడ్చుచున్నారు?" అని క్షితీంద్రుఁడు గర్జించుచుఁబోయి వారిపైఁబడ నెంచెను. కాని వారు కదలలేదు. పలుకలేదు. లాంతరు వెలుతురు వారి ముఖములపైఁ బ్రసరించెను.

అసహాయములై దీనములైన దృష్టులతో ఆగ్రహపూరితుఁడగు యజమానివంకఁ జూడఁదొడఁగిరి.

"ఇది యంతయు నేమి?" అని రాయ లాశ్చర్యమును బ్రకటించెను. తరువాత కాని ప్రక్కనున్న లాంతరును జేబూని దాని వెలుతురులో వారిని బరిశీలించెను. ఏమి జరిగెనో స్పష్టముగా తెలియవచ్చెను. వారి కాలుచేతులు బంధింపబడి యుండెను. నోళ్లలో గుడ్డలు కుక్కబడియెను. ఆ కారులో వారు కుదింపఁబడియుండిరి. రాయలు తన జేబులోనుండి చిన్న చాకునుదీసి వారి బంధములను గోసివైచెను. నోళ్లలోని గుడ్డలను దీసివైచెను. వారు దగ్గుచు కాళ్ళుచేతులను సవరించుకొనుచు నెమ్మదిగాలేచి నిలుచుండిరి. రాయలు వారి నుద్దేశించి "ఇదియేమి మరల క్రొత్తనాటకము?" అని ప్రశ్నించెను.

"ఆ సుజీవరులు—" అని బదరీ చెప్పబోయెను.

"వారు వెనుకనుండి తెలియకుండవచ్చి హఠాత్తుగా మామీఁద బడినారు." అని కిషన్ సింగు వాక్యమును పూర్తిచేసెను.

"వారు మానోటిలో గుడ్డలుకుక్కి కాళ్లుచేతులు కట్టి పడవైచిరి." అని బదరి వివరించెను.

"తరువాత ఆ రెండు మోటారుకారులను దీసికొని పోయినారు." అని కిషన్ సింగు పర్యవసానమును దెల్పివైచెను.

"రెండుకారులలోఁ బాఱిపోయినారా?" అని క్షితీంద్రుఁడు కొయ్యబాఱిపోయెను. రాయలు నిగ్గఱగా నవ్వెను.

"మహాశయా! దండధరుఁడు పూనుకొను కార్యములకు ఆటంకము లుండవు. మఱియు నవి అసంపూర్ణములుగా జరగవు. ఇది చాల చిత్రముగా నున్నది" అని ఆతఁ డనియెను.

క్షితీంద్ర:- చిత్రముగా నున్నదా? చిత్ర మెక్కడనుండి వచ్చినది? నా చిత్రములు-కిరీటము. వాని గతియేమి కానున్నది?"

రాయలు నవ్వుటమాని గాంభీర్యమును వహించెను. ఆతఁడు ప్రస్తుత కర్తవ్యమునుగుఱించి తీవ్రముగా నాలోచింపఁదొడఁగెను.

రాయలు:- ఏమియునుగాదు. మన సన్నాహములలోఁ గొంచెము మార్పు రాఁగలదు. ఈకారులో నేను ఆలహాబాదుపోయెదను.

క్షితీంద్ర:- ఇది ఒకపాతడొక్కు. దీనిలో నీవుపోఁజాలవు.

రాయలు:- మీకాభయ మక్కఱలేదు. నేనెట్టులైనను బోయితీరెదను. రెండు వందలమైళ్ళు నాకొక లెక్కలోనిదిగాదు. కాని-మిమ్ములను జయంతశ్రీని-యీదుర్గములో నేకాంతముగా వదలిపెట్టిపోవుట నాకిష్టము లేదు. ఈదొంగలు మనము నగరము చేరకుండుటకై కారులనుదీసికొని పోయి వానినెక్కడనో వదలివైచి మఱలి యిక్కడకు రావచ్చును."

క్షితీంద్ర:- నీవు పొఱబడుచున్నావు. లక్షరూపాయలిచ్చినను నే నీదుర్గములో నొక క్షణమాత్రమేనియు నుండను. కారులేనిచో రైలు మీఁద రాగలము.

రాయలు:- రైలుమీఁదనా? ఆఱుగంటలు రైలులోఁగడుపఁగలరా? రెండు చోట్ల బండ్లుమాఱవలెను. మీరునిజముగా రైలుమీఁదబోఁదలచినారని నేను భావింపను.

క్షితీంద్ర:- నేను నిజముగా రైలులోవచ్చెదను. రండు. నేను జయంతిశ్రీతోఁ జెప్పి వెంటనే బయలుదేఱవలసియున్నది. ఇఁక వ్యవధానములేదు. అని యాతఁడు దుర్గభవనమువైపునకుఁ బోయెను.

రాయలు కిషన్ సింగు నుద్దేశించి "ఓయీ! దీపములువెలిగించి "పెట్రోలుటాంకు" నింపుము. ఇంజనునుగుఱించి కొంచెము సర్దుబాటుచేసి కొని భగవంతునిపై భారమువైచెదను." అనిచెప్పి అతఁడుకూడ భవనమువైపు పోయెను. అతనిని బదరి అనుసరించెను.

రాయలు ప్రధానమందిరములోనికి వచ్చుసరికి క్షితీంద్రుఁడు జయంతశ్రీని బ్రతిమిలాడుచుండెను. జయంతశ్రీ రైలులోఁబ్రయాణముచేయనని పట్టుబట్టెను. క్షితీంద్రుఁ డామెకీపర్యాయము రైలుప్రయాణము తప్పదని చెప్పుచుండెను. వారిరువురు నిశ్శబ్దముగానున్నపుడు సుమబాల వారినిసమీపించి నెమ్మదిగా "ఇప్పుడు రైలున్నదా? రాత్రి పండ్రెండుగంటలకొక బండియున్నది. దానికిఁబూర్వ మింకొకటియున్నదా?" అనియెను.

"టైముటేబిలు" ఎక్కడ? తీసిచూడుఁడు." అని క్షితీంద్రుఁడఱచెను.

రాయలు:- నేను ఇంతకు పూర్వమిక్కడనే యొకచోట చూచినాను. అదిగో! ఆబల్లసొరుగులో నుండవలెను-అనుచు నాతఁడుపోయి దానిని గొనివచ్చి క్షితీంద్రునకిచ్చెను.

క్షితీంద్రుఁడా సక్తితో దానినందుకొని కొన్నిపుటలు తిరుగవైచి ఒక పుటవంక ధ్యానముంచిచూచి "అమ్మయ్య! బ్రదికినాము. తొమ్మిగంటలకొక బండియున్నది." అని బిగ్గఱగాఁ బలికెను.

జయంతిశ్రీ:- ఉన్నందువలన ప్రయోజనమేమి? మనము 'స్టేషను'కుఁ జేరు కొనుటెట్లు?

వాఁడొండొరుల ముఖములను జూచికొనిరి. రాయలను వెంబడించి ప్రధానమందిరములోనికి వచ్చినబదరికి ఒకయుపాయము తోఁచెను. అతఁడు వెంటనే "మనసామానుబండి యున్నది." అనియెను.

"సామానుబండియా?" అని జయంతిశ్రీ వెటకారముతో మూతి విఱిచెను.

క్షితీంద్ర:- ఔను. అదియేమంచిది. నేనే బండినితోలెదను. బదరీ! వెంటనే పోయి బండికి గుఱ్ఱమునుగట్టి తీసికొనిరమ్ము!

యజమాని ఆజ్ఞలను నిర్వర్తించుటకై బదరి వెడలిపోయెను.

వారు బయలుదేఱుట నిశ్చయమని తోఁచినవెంటనే రాయలు "ఎన్నిగంటలైనది?" అని ప్రశ్నించుకొనుచు తనగడియారమును జూచెను. తండ్రికొమార్తెల గడియారములకు చాలా వ్యత్యాసము గానబడియెను.

వారు సరియైనవేళను గుఱించి తర్కించుకొనదొడఁగిరి. నిరర్థకమైన వారివాదన నాపుజేయు నుద్దేశ్యముతో రాయలు బిగ్గఱగా నిట్లుపల్కెను.

"మీరిట్లే వాదించుకొనుచుండుఁడు. ఈవాదనముగిసి మీరు బయలుదేఱు నంతవఱకు నేను కనిపెట్టుకొని యుండఁజాలను. మీకొక యర్ధగడియ ఆఁగి ప్రయాణముకావచ్చును. వారు సిద్ధముకాఁగానే నేనుపోయెదను."

జయంతిశ్రీ:- మఱచినాను. మనము ప్రయాణముచేయు రైలుబండికి భోజనములపెట్టె యుండునా? నిద్రలేమికిఁదోడు నేను ఉపవాసము చేయజాలను.

క్షితీంద్ర:- ఈబండికి భోజనములపెట్టె యుండదు. కాబట్టి యిక్కడనే మనము భుజించి వెంట కొన్ని తినుబండారములు తీసికొనిపోవలెను. సుమబాలా! ఊర్మిళా! పాకశాలలోనికిఁబోయి ఏమి తినుబండారములున్నవో చూడుఁడు. లేనియెడల త్వరగా నేవేని చేయుమని వంటలక్కతోఁ జెప్పుఁడు.

ఊర్మిళా సహితముగ సుమబాల ఆమందిరమునువీడి భవనాంతర్భాగమునకేగుటకు ద్వారమునొద్దకు వచ్చెను. అక్కడ నామెకు రాయలు తారసిల్లెను.

"సుమబాలా! నేను పోవుచున్నాను." అని ఆతఁడనియెను.

"ప్రభూ! మీరీ యర్ధరాత్రివేళ నొంటరిగా బోవుచున్నారు. జాగ్రత్తగానుండుఁడు." అని సుమబాల పలికెను.

"జాగ్రత్తగానే యుండెదను." అని రాయలనియెను.

ద్వారమునొద్ద కారువచ్చిన సవ్వడి వినవచ్చెను. రాయలు జయంతశ్రీ క్షితీంద్రులకడ సెలవుతీసికొని కారులో వెడలిపోయెను.

క్షితీంద్రుఁడు లేచి దీపములన్నింటిని ఆర్పుటకుఁ బూనుకొనెను. ఆఁతఁడప్పుడప్పుడు కిటికీలవంక తత్తరపాటుతోఁ జూచుచుండెను. రాయలుకూడ వెడలిపోయినాఁడు గనుక దొంగ లొక్కుమ్మడి తనపై దూకెదరేమో అని యతనిభయము.

ద్వారమునొద్ద సవ్వడి వినవచ్చెను. కిషన్‌సింగు లోనికిఁ బ్రవేశించెను.

"అయ్యా! ఇక్కడ బదరీకిఁదోడుగాఁ గాపుండుటకు దొరగారు నన్ను వెనుకకుఁబంపినారు." అని వాఁడు విన్నవించెను.

క్షితీంద్రుఁడు వానికి గృహసంరక్షణమును గూర్చి కొన్ని విషయములు చెప్పెను.

బదరి యుద్ధమునుండివచ్చిన సిపాయికాబట్టి తుపాకితో ప్రధాన మందిరములో నుండవలెను. కిషన్‌సింగు ప్రక్కననున్న పెద్దగదులు రెంటిని గాపాడవలెను. ఆతఁడుగూడ నొకతుపాకి తీసికొనవలెను. క్షితీంద్రుఁడు వానివెంట దీసికొనిపోయి రెండుతుపాకులు కొన్నితోటాలు ఇచ్చెను. వారు ప్రధానమందిరములోనికి రాఁగనే సుమబాల వారిని భోజనశాల కాహ్వానించెను. అక్కడ జయంతశ్రీ చల్లారిపోయిన పదార్థములు భుజించుటకు మారము చేయుచుండెను. వారు సాయంకాలముననే ప్రయాణమగుదురని యప్పటికే సర్వసౌష్ఠవముగ పాకము సంసిద్ధము చేయఁబడి యుండెను.

వారు భోజనము ముగించుసరికి కిషన్‌సింగు తుపాకితోవచ్చి బదరి గుఱ్ఱమును గట్టినాఁడనియు బండి వాకిట సిద్ధముగానున్నదనియుఁ జెప్పెను.

క్షితీంద్ర:- మేము వచ్చువఱకు నీవు బండిదగ్గఱనుండి బదరీని ఇక్కడకుఁ బంపుము.

కిషణ్‌సింగు వెడలిపోయెను. కొంచెముసేపటికి బదరి లోనికివచ్చెను. క్షితీంద్రుఁడు బదరివంక నిదానించిచూచెను. తరువాత నాతఁడు "బదరీ! భారమంతయు నీమీఁదమోఁపి నేను పోవుచున్నాను. నీవు యుద్ధముచేసి వచ్చినసిపాయివి. నీగౌరవమునకుఁ దగినట్లుగా నీదుర్గ సంరక్షణభారమును నీవు వహింపవలెను." అని పలికెను.

బదరి చేతనైనంతవఱకు సిపాయివలెఁ గనబడుటకుఁ బ్రయత్నించెను.

క్షితీంద్ర:- బదరీ! ఎట్టి దురంతములైనను జరుగవచ్చును. ఒక్క దొంగతనమే గాదు- దౌర్జన్యము- దారుణహింసాకాండ- ఏదైనను గావచ్చును.

బదరి:- అయ్యా! మీరు భయపడవలదు. యుద్ధభూమిని జూచి వచ్చిన నాకిది యొక లెక్కలోనిది గాదు.

క్షితీంద్ర:- మంచిది. భారమంతయు నీమీఁద వైచిపోవుచున్నాను. నా నిక్షేపములన్నింటిని నీవు కాపాడవలయును.

క్షితీంద్రుఁడు లేచి బయలుదేరెను. ఆతఁడు "లెండు. పోవుదము. మనము రైలుకుబోవు వేళ మించిపోవుచున్నది." అని తొందరచేయుచు సింహద్వారమును సమీపించెను.

సామానుబండి చాల యెత్తుగా నుండెను. వారు దాని నెక్కుటకై ఒక కుర్చీపీట వేయవలసివచ్చెను. క్షితీంద్రుఁడు బండిని తోలుటకై ముందఱ కూర్చుండి గుఱ్ఱము లగామును జేతఁ బుచ్చుకొనెను.

క్షితీంద్ర:- ఈ పాడుమోటారుకారులను నేను ఎన్నఁటికిని నమ్మకొని యుండఁజాలను. ఈగండము గడచినతరువాత వానినన్నింటిని బోకడ వెట్టి విశాలముగానుండు బగ్గీలను తయారుచేయించెదను.

సింహద్వారము మెట్లమీఁద నిలువఁబడియున్న బదరీ కిషణ్‌సింగుల వంకఁజూచి "వీరభారత పుత్రులారా! మీ ధైర్యసాహసములను బ్రదర్శింపుఁడు." అని పలికెను. బయలుదేరుచున్న తమయజమానికి వారిరువురు నమస్కరించి సెలవు గైకొనిరి. శకటము సాగి అంధకారములో నగపడకుండఁ బోయెను.

శకట మదృశ్యమగునంతవఱకుఁ జూచి బదరీ కిషణ్‌సింగులు భవ

నములోనికి వచ్చి ప్రధానద్వారమును బంధించిరి. బదరి కిషన్‌సింగును జూచి విచారముతో నిట్లనెను.

"నా కిది యిష్టములేదు. ఆదొంగల కిక్కడ పనియేమున్నది? వారు మన గొంతుకలను ఓసికివైచెదరు."

కిషన్‌సింగు:- ఏమైనను జేయవచ్చును. ఈ దుర్గభవనమును గాపాడు గౌరవ భారము నీవు వహించియున్నావు. నీవీ ప్రధానమందిరమును గాపాడుము. నేను తక్కిన గదులను కనిపెట్టియుందును. వారటునుండి వచ్చుటకు మార్గములు లేవు. అటియేగాక- ప్రధానమందిరములోనికి గల ద్వారములన్నింటిని బంధించి తాళములు వైచెదను.

బదరి:- కాని- మనయెదుట నున్న ద్వారమును మాత్రము బంధింపకుము.

కిషన్‌సింగు:- కాదు. కాదు. దానిని విధిగా బంధింపవలయును. నీవు ఒక తుపాకిని దెచ్చుకొనుము.

వారు తుపాకులున్న గదిలోనికి బోయిరి. బదరి ఒక తుపాకిని దీసికొనెను. వారు వంట యింటిలోనికిం బోయిరి. కిషన్‌సింగు తనకు వలసిన తినుబండారములు తీసికొని తన గదిలోనికి బయలుదేరెను. అతని వెంటనే బదరీ కూడ ప్రధానమందిరములోనికి వచ్చెను. కిషన్‌సింగు ద్వారమును బంధింపంబోవుచు గడపమీంద నిలువంబడి "దొంగ లగపడినవెంటనే తుపాకిని గాల్చుము. జాగ్రత్త" అని పలికి తలుపులను మూసి తాళమువైచెను.

విశాలమగు దుర్గప్రధానమందిరములో బదరీ ఒక్కడు నిలుచుండి నలువైపులను బరికించెను. అతనికి భయము కలిగెను. అతనికి సమీపములో పదధ్వనులు స్పష్టముగా వినవచ్చెను. ఆతండా దిశకుం బోయి వంటయింటి వైపు జూచెను.

బదరి భార్య అతని భోజనమును సమకూర్చుచుండెను. ఆతం డామెను జూసి "అంతపెద్ద యుద్ధమును జూచినప్పుడైనను ఇంత భయము కలుగలేదు." అనెను.

"భయమా! ఎందుకు?"

"ఎందుకేమిటి? దొంగలు! హంతకులు!"

అతండు క్షితీంద్రుని విషయమంతయు జెప్పెను. ఎట్టు లాతడు భయవిహ్వలుండై పరితపించి తనను భవనరక్షణ కార్యమునకై నియోగించెనో

వివరించెను. ఆమె ఆ సమాచారమంతయు శ్రద్ధగా నాలకించి "ప్రాణము లున్న యెడల బలుసాకు తిని బ్రదుకవచ్చును. సింహద్వారమును బేడెములతో బిగించి తాళములు వైచి యివటికి రండు. వంటయింటిలోనికి ఎవరును రారు." అని బోధించెను.

బదరీ:- మంచి ఆలోచన చెప్పినావు! యజమాని నిక్షేపములకు రక్షణ యెట్లు?

భార్య:- ఆయన నిక్షేపములను తానే రక్షించుకొనగలడు. మీ కున్నది ఒక్కటే గొంతుక. దానిని నేను కోయనీయను. ఇక్కడ కూర్చుండి భోజనము చేయుడు. ముందుగా సింహద్వారమునకు దాళమువైచి రండు. ఎందుకైనను మంచిది."

బదరి అట్లే చేసివచ్చి భోజనమునకు గూర్చుండెను. భయములో నణగిపోయిన ఆతని ఆకటిచిచ్చు ఇప్పట్టున ప్రజ్వరిల్లెను. కాని నిర్భయముగా దినలేకపోయెను. మధ్య మధ్య దొంగలసవ్వడి వినవచ్చునేమోయని తినుట మాని ఆలకించుచుండెను.

ఆతనికి దాహము మెండుగా నుండెను. మంచినీళ్లతో పొట్టనింపుకొన దొడగెను. ఆతడు భోజనము ముగించి పొగాకుచుట్టను వెలిగించుకొని భార్యతో ముచ్చటింపసాగెను. పొగ త్రాగుకొలదిని పోయినధైర్యము తిరిగి వచ్చుచున్నటుల నాతనికి దోచుచుండెను. తన కర్తవ్యభారమును నిర్వహించి యజమాని ఐశ్వర్యమును గాపాడుటకై వలయుచో దన ప్రాణములనైన నర్పణము సేయుటకు సంకల్పించుకొనియెను.

ఆతడు దొంగల నేవిధముగా నెదుర్కొనదలచినది తన భార్యకు ప్రదర్శించి చూపించెను. మొదటి ముగ్గురను వీరవిక్రమునివలె దాను వారిపైకి లంఘించి యెట్లు వారినొడిసి పట్టి నాలుగవవానిపైకి దుముక నుంకించెనో చెప్పుచుండగా సింహద్వారమును గట్టిగా దట్టిన చప్పుడు వినవచ్చెను.

బదరి ఎత్తినచేయి ఎత్తినట్లుగానే ఆగిపోయెను. తెఱచిన నోరట్లే యుండెను. కాని మాట వచ్చుటలేదు. ఆతనికి తెలియకుండగనే దేహము వణక నారంభించెను. బదరిభార్య వంటయింటి తలుపులుగూడ మూసి తాళము వైచెను. మ్రోకులవలె నొకరివంక నొకరు చూచుకొనుచు నిశ్శబ్దముగ నిలువబడిపోయిరి.

సింహద్వారమునొద్ద కేకలు మెండయ్యెను. కేకలమధ్య సింహగర్జనలవలె కొన్ని నినాదములు వినవచ్చుచుండెను. మగడు పెండ్లాము తెల్లముగము

లతో నిల్వఁగుర్రిడ్లు వైచుకొని చూచుచుండిరి. బదరి వణకుచున్న చేతులతో తుపాకిని దీసికొనెను. కాని కదలలేకపోయెను.

వాకిట పిలుపులు, కేకలు, సింహనాదములు అట్టహాసముగా నుండెను.

కొంతసేపటికి బదరిభార్యముఖములో గొంతమార్పు గోచరించెను. ఆమె భర్తనుజూచి "ఇది మనయజమాని కంఠస్వరమువలె నున్నది." అనియెను.

"యజమానికంఠస్వరమా! నిజముగానా? లేక పొరబడుచున్నావా?" అని బదరి ఆమెచెవిలో గుసగుసలాడెను.

"అవును. సందేహము లేదు" అని ఆమె లేచి తలుపులు తెఱచి చూచెను.

క్షితీంద్రుని గర్జానినాదము దిక్కుల ప్రతిధ్వనించెను. దానిని వినగానే బదరిధైర్యము శతగుణాధికముగా విజృంభించెను. అతఁడా విశాలమందిరమును దాఁటి తనభార్యను ప్రక్కకునెట్టి తానా ద్వారములో నిలువఁబడెను. క్రిందమెట్లమీఁద క్షితీంద్రుఁడును, జయంతశ్రీయును, కుసుమబాలయు నిలువఁబడి యుండిరి. ఊర్మిళ శకటమునొద్ద నుండెను.

క్షితీంద్ర:- బదరీ! ఏమిచేయుచున్నా రింతసేపటికిని దలుపులు తీయరు? వర్షములో తడిసి ముద్దలైనాము. మీకు బొత్తుగా జ్ఞానములేదు.

బదరి:- దొ. దొ. దొంగలు-మీరు దొంగలని........"

క్షితీంద్ర:- దొంగలు! నేను మీ అభిప్రాయములో దొంగనా?

అని బదరివంక జఱచుఱ చూచుచు లోనికిఁ బ్రవేశించెను. జయంతశ్రీ అతని వెంబడించెను. ఆమె వర్షపుటంగరకాను తీసివైచి కోపముతో నిట్లనియెను.

"తొమ్మిది గంటలకు బండి ఉన్నదోలేదో ముందుగా నెందులకుఁ జూచుకొనలేకపోతిమో నా కర్థమగుటలేదు. నేనీ రాత్రికిఁక ప్రయాణము చేయఁజాలను. ఆ అర్థరాత్రిబండికి నాఎత్తు ధనముపోసినను నేను రాను."

క్షితీంద్ర:- ఇది మౌఢ్యము. మనము పోవలెను. ఏదీ! మనముచూచిన "టైము టేబిలు"! ఇదిగో! ఈబల్లపై నున్నది." అని దాని అట్టమీఁదనున్న తేదీని పరికించి "రామచంద్రా! ఇది గతసంవత్సరమునాఁటిది" అని నివ్వెఱపడియెను.

జయంతశ్రీ:- అయ్యో! ఎంతపనిజరిగినది! ఇది తుషారకాంతుని హాస్యకేళిలలో

నొక అష్టాదశ మహాశిల.

పచ్చలపతకము గలపెట్టె అక్కడ నొక చిన్నబల్లపై నుండెను. దానిని దీసికొని జయంతశ్రీ తెఱచి చూచెను. అది శూన్యమైయుండెను. దానిలో బతకము లేదు.

"ఈపెట్టె శూన్యముగా నున్నదేమి? ఎవరైనా తీసినారా? నాకు జ్ఞాపకములేదు." అని ఆమె ప్రశ్నించెను.

"దానిని దొంగిలించియుందురు. ఎన్ని పర్యాయములు నవరత్నఖచితములైన నీ కంకణములు కానరాకుండపోలేదు? అట్లే ఇదికూడ పోయియుండును." అని క్షితీంద్రుడు పలికెను.

జయంతశ్రీ:- కాదు. తుషారకాంతుడు దానిని దీసి జాగ్రత్తచేసియుండును. అది నగరమునకుఁ బ్రయాణము చేయుచున్నది.

# ౮

# రాయల ఆగమనము

రాత్రి యంతయును వర్షించుచునే యుండెను. తెల్లవారినను నీలమేఘావృతమైన ఆకాశముమూలమున నింకను చీఁకటిగానే యుండెను. ప్రాభాతికశోభచే కళకళ లాడుచుండవలసిన ప్రకృతి విషాదమూర్తియై నీలావకుంఠనము దాల్చికొని నశించుచుండెను.

అలహాబాదు నగరములోని (పోలీసుస్టేషను) రక్షకభట కార్యాలయము సందడిలేక శాంతముగా నుండెను. రాత్రి 'డ్యూటీ'లోనున్న ఇన్స్పెక్టరు ఆవులించుచు బల్లముందఱ కూర్చుండియుండెను. ఆతఁడు విడుదలకొఱకు నిరీక్షించుచుండెను. అతనితోఁబాటు ఒక రక్షణభటుఁడు వాకిటను, ఇద్దరు లోపల బెంచిమీఁదఁ గూర్చుండియు నావులించుచుండిరి. అంతయు నిశ్శబ్దముగా నుండెను.

అట్టిసమయమున బ్రహ్మాండమైన శబ్దముతో ఒక మోటారుకారు వచ్చి నిలచెను. వారందఱి దృష్టులును అప్రయత్నముగా ద్వారమువంకకు మఱలెను.

మోటారు కోటును టోపిని ధరించిన నొకయువకుడు లోనికి ప్రవేశించెను అతడుంతట నొక్క-సారి కలయజూచి యిట్లు పలికెను.

"నేను రాజగిరి దుర్గాధిపతిని. కోటీశ్వరుడగు శ్రీ క్షితీంద్రనాథుని పక్షమున వచ్చినాను. నిన్నటి సాయంకాలము వారికి దండధరు నొద్దనుండి ఒక ఉత్తరము వచ్చినది. ఈనగరములో నున్న వారిభవనమును ఈ ఉదయము న నే కొల్లగొట్టుటకు సంకల్పించినాడట."

దండధరుని పేరు వినగనే ఇన్స్పెక్టరు ఒక్క-యుదుటున కుర్చీనుండి లేచెను. తక్కి-న రక్షకభటులుకూడ లేచి నిలుచబడిరి. వారి నిద్రమత్తు మాయమైపోయెను.

"ప్రభూ! ఆ ఉత్తర మెక్క-డ?" అని ఇన్స్పెక్టరు ప్రశ్నించెను.

సుకుమారకాంతుడు లోపలి జేబులో గుప్తముగానున్న ఉత్తరమును దీసి ఇన్స్పెక్టరు చేతికిచ్చెను.

ఇన్స్పెక్టరు ఆ ఉత్తరమును జదివి బాగుగా పరిశీలించెను.

"ఈదస్యూరిని నేను బాగుగా నెఱుగుదును. ఇట్టి ఉత్తరము లాతని నిత్యకృత్యములు" అని అతడు పలికెను.

రాయలు:- మనకిక వ్యవధానములేదు. నేను కొన్నిగంటలకు పూర్వమే యిక్క-డకి వచ్చియుందును. మార్గమధ్యమున నవాంతరములు తటస్థించినవి. ఇప్పటికే చాల ఆలస్యమైనదని భయపడుచున్నాను.

"ప్రభూ! రండు. పోవుదము. మీ రిరువురును నాతోడ రండు" అని ఇన్స్పెక్టరు బయలుదేరెను.

వారు నలుగురును కలసి కార్యాలయావరణమును దాటి వీథిలోనికి వచ్చిరి. రాజబాటపై బురదతోc గూడికొనిన యొక మోటారుకారు నిలుపబడి యుండెను. దానిపైc బ్రదర్శింపcబడిన పలురకముల బురదలు-బూడిదరంగు బురద-నల్లరేగడ బురద-ఎఱ్ఱని బురద-అది ప్రయాణముచేసిన ప్రదేశములను, దూరమును వేగమును విశదము సేయుచుండెను. అం దిరువురకు మాత్రమె వసతియుండెను.

"రండు! మిమ్ములను కారులోc గొంపోయెదను. మీ రక్షకభటులు సైకిళ్ళపై రావచ్చును" అని రాయ లాఇన్స్పెక్టరు నాహ్వానించెను.

రాయలు కారులోనికి దూరెను. ఇన్స్పెక్టరు లంఘించి ప్రక్క-కూరుచుండెను. వారు బయలుదేఱి వెనుక వచ్చు రక్షకభటులు తమను వెంబ

డించుటకు వీలుగానుండునట్లు కారును నెమ్మదిగా నడుపుచుండిరి. అదియును గాక వెనుక చక్రము చిల్లిపడి గాలిపోవుటచే నా కారు సైతము వేగముగాఁ బోఁజాలకుండెను.

ఐదునిముషములకు వారందఱును క్షితీంద్రనాదుని భవనమును జేరుకొనిరి. అందు నెవ్వరును నివసించుచున్న జాడలు గానరాకుండెను. క్రింద భాగమందును మేడమీఁదను ద్వారములు గవాక్షములన్నియు మూసియుండెను.

తన జేబులోనుండి బీగముల గుత్తినిలాగి రాయలు మెట్లు నెక్కి సింహద్వారమును సమీపించెను. ఇన్స్పెక్టరాతని వెంబడించెను. రాయలా గుత్తిని పరీక్షించి యొక తాళపుచేతిని దీసి తాళములోనికి జొప్పించి త్రిప్పెను. కాని తాళము తెఱచికొనలేదు. అతఁడు మఱియొక తాళపుచేతిని బెట్టి త్రిప్పెను. కాని రాలేదు. అతఁడట్లే మఱికొన్ని బీగములతోఁ బ్రయత్నించి చూచెను. కాని ఏమాత్రమును బ్రయోజనము లేక పోయెను. తాళము సుదృఢమైన యట్లే యుండెను.

"నన్నుఁ బ్రయత్నింపనిండు. మాకిట్టి పనులు నిత్యాభ్యాసములోనివి" అని ఇన్స్పెక్టరు రాయల చేతినుండి బీగముల గుత్తిని దీసికొని యొకదాని వెంబడి యొకటి తీసి తాళమును తెఱచుటకుఁ బ్రయత్నించెను. ఒక్కటిగూడ తాళమును దెఱవఁజాలక పోయెను. పడిన శ్రమయంతయును వ్యర్థాయయ్యెను.

రాయలు విసుగుతోఁ "నాకు వేఱు బీగముల నిచ్చినారు" అని కొంచెమాఁగి "కాదు. కాదు. నా కిపుడర్థమైనది. ఏమిజరిగినదో యిప్పుడూహింపఁబొడగట్టు చున్నది. ఈ బీగముల గుత్తిని మార్చివేచినారు." అని పలికెను.

"మార్చినారా! ఎప్పుడు? ఎక్కడ?" అని ఇన్స్పెక్టరడిగెను.

"గత రాత్రిమున రాజగిరి దుర్గములోనే జరిగినది. ప్రధానమందిరములోని వాతాయన ద్వారమున పాఱిపోవుచున్న చోరుని జూచి యున్నట్లు శ్రీ క్షితీంద్రనాథుఁడు చెప్పెను. తరువాత ఈ బీగములున్న అలమార తాళము బ్రద్దలు కొట్టి యుండుట మేమందరమును జూచితిమి." అని రాయలు ప్రత్యుత్తర మొసంగెను.

ఇన్స్పెక్టరు తలుపులన్నిటిని తట్టుట ప్రారంభించెను. అతఁడు సింహద్వారమునకుఁ గుడిప్రక్కగా సరాసరి పెరడులోనికిఁ బోవు ద్వారమును రక్షక భటులకుఁ జూపుచు దాని తలుపులను దెఱచుట కాజ్ఞాపించెను. కాని

అదికూడా తాళము వేయబడి యుండెను. ఇన్స్పెక్టరు చేసిన సందడికి భవనములో నుండి యెట్టి ప్రత్యుత్తరమును లేకపోయెను.

"ఈ భవన సంరక్షకుఁ డెక్కడ నున్నాఁడు?" అని యాతఁడడిగెను.

రాయలు చకితుఁడయ్యెను. "భవన సంరక్షకుఁ డొక్కఁడే కాదు. గృహనిర్వాహకురాలు కూడ కలదు. ఆమె పేరు రాజామాయి. ప్రాణములతో వారు మన కగపడునట్లు దైవ మనుగ్రహించుగాక!" యని రాయలనియెను.

"హంతకుని వ్యాపారము హత్యలతోఁ గూడుకొనినది కాదు. కాఁబట్టి వారికెట్టి ప్రాణాపాయమును సంభవించి యుండనేరదు."

"యేమైనను వారు లేచి తలుపులు తెరచుట కశక్తులై యేమూలనో పడి యుందురు. మనము తాళములు పగులగొట్టి తలుపులు తెరచుట భావ్యము కాదా?" యని రాయలనిరి.

ఇన్స్పెక్టరు కొంచెము తటపటాయించెను.

"కొందఱు తమ తలుపులను బగులగొట్టుట కిష్టపడరు. మఱి - క్షితీంద్రనాథుఁడు—"

"అందులకు మీరు సంశయింపవలదు. ఆ బాధ్యత నేను వహించెదను" అని రాయలనియెను.

"అట్లు మీరు బాధ్యత వహింతురేని యేపని యైనను చేయఁగలము." అని ఇన్స్పెక్టరు రక్షక భటునొకని పిలచి "ఓయీ! నీవు వెంటనే పోయి తాళములు బాగుచేయు వానిని గొనితెమ్ము." అని యాజ్ఞాపించెను.

"పదినిమిషములలో వచ్చి పనిచేసి పెట్టినచో రెండు రూపాయలు బహుమాన మిత్తుమని కూడా చెప్పుము" అని రాయలు జోడించెను.

రక్షక భటుఁడు వెడలిపోయెను. ఇన్స్పెక్టరు వంగి మెట్లను జాగ్రత్తగా పరీక్షించి చూచెను. బాటనుగూడ బాగుగాఁ బరిశీలించెను. రాయలు సిగరెట్టును వెలిగించి యిన్స్పెక్టరు నుపలక్షించుచుండెను. క్షితీంద్రనాథుని భవనమున కావలివైపున నొక్కటే యిల్లుగలదు. ఆ యింటి తరువాత రాజమార్గమున్నది. ఆ మూలనున్న యిల్లు శూన్యమై యుండెను. ఇన్స్పెక్టరు రాచబాటను పరిశీలించుచు మూలకుఁ జరిగెను. మిగిలిన రక్షక భటుఁడు మార్గము వెంబడే ముందునకుఁ బోయెను. రాయలు గోడకుఁ జేరగిలఁబడి విశ్రాంతిగా సిగరెట్టును పీల్చుచుండెను. ఆశాభంగ సూచకమగు ముఖముతో ఇన్స్పెక్టరు తిరిగి వచ్చెను.

"మీ రేమైన కనిపెట్టినారా?" యని రాయలాతని నడిగెను.

"ఏమియును లేదు" అని యిన్స్పెక్టరు బదులు పలికెను.

అతఁడు మరల తలుపులను దట్టసాగెను. లోపలనుండి యెట్టి శబ్దమును వినబడలేదు.

ఇంతలో రక్షకభటుఁడు తాళములు బాగుచేయువానిని గొనివచ్చెను. అతఁడొక మహమ్మదీయుఁడు. బాగుగా యెదిగిన గడ్డము మీసములతో నాతఁడు పొట్టిగానుండి భుజమునకొక తోలుసంచిని దగిలించుకొని చేత పలు రకముల బీగములుగల యినుప చక్రములను రెంటిని పట్టుకొని పరుగు పరుగున వచ్చెను. అతఁడు వెంటనే పనిచేయుట కుపక్రమించెను. కాని అది సులభ కార్యముగాఁ గన్పడలేదు. తాళము కడు బలిష్ఠముగా నుండెను. అయిదునిమిషములైన తరువాత ఒక గంటకాలము తాళమును దెఱచుటకే వినియోగింప వలసి వచ్చునని యాతఁడు తెలిపి గొళ్ళెమున్న మేరకు తలుపును గోసివైచుట కనుజ్ఞవేడెను.

"కోసివేయుము." అని రాయ లాజ్ఞాపించెను.

పనివాఁడు పరికరములనుమార్చి పనిచేయుట ప్రారంభించెను. మూఁడు నిమిషములకు తలుపుచెక్కను చతురశ్రముగాఁ గోసివైచి గొళ్ళెమును దీసివైచెను.

సింహద్వారము తెఱువఁబడియెను. ఇన్స్పెక్టరు రివాల్వరును పైకితీసి భవనములోనికిఁ బ్రవేశించెను. రాయలాతని వెంబడించెను. రక్షకభటులును దమ రివాల్వరులను జేతఁబూని వారి ననుగమించిరి. గవాక్షములన్నియును మూసియుండుటచే హాలంతయుఁ గనుచీకటిగా నుండెను. రక్షకభటులలో నొకఁడు వెంటనే పోయి వాతాయన ద్వారమును దెఱచెను. లోనికిఁ దగినంతగాలియు వెలుతురును వచ్చెను. ఆ హాలంతయును శూన్యముగా నుండెను. కుర్చీలు బల్లలు మున్నగునవి వాని యథాస్థానములలోనే యుండెను. బందిపోటు జరిగిన చిహ్నము లేవియును గానరాకుండెను.

"ఈభవన సంరక్షకుఁ డేఁడీ?" యని యిన్స్పెక్టరు రక్షకభటులను ప్రశ్నించెను. వారు కుడిప్రక్కగానున్న ద్వారమును దాటి యావలివైపున నున్న సంరక్షకుని గదిలోనికిఁబోయి చూచిరి. అరనిముషములో ఒకఁడు తిరిగి వచ్చి "అయ్యా! ఈభవన సంరక్షకుని-అతని భార్యను నోళ్లలో గుడ్డలు జొనిపి కాలుచేతులు గట్టి పడవైచినారు." అని చెప్పెను.

"దోపిడి సేయుట కుద్దేశింపఁబడిన గదులు మేడమీద నున్నవి.

పైనున్న మందిరము దర్శనీయమగు కళాకేంద్రము. రండు. మనము సకాలమునకే వచ్చియుండవచ్చును. ఆ దుర్మార్గులింకను భవనము వీడి వెడలియుండరు." అని రాయలు పలికెను.

రాయలట్లు పలికి వెంటనే మేడమీఁదికిఁ బరుగెత్తెను. అతని వెంట నంటి యిన్స్పెక్టరును బరుగెత్తెను. రాయలు మెట్లనెక్కి నడవదాఁటి పై మందిర సింహద్వారమును దెఱచి గుమ్మముకడనే తటాలున నాఁగిపోయెను. ఏమున్నది? అప్పటికే మిగిలిపోయినది.

ఆమందిరములోని సామగ్రియంతయును జిందరవందరగాఁ బడియుండెను. ఆసనములన్నియుఁ దలక్రిందులుగా నుండెను. కళాప్రపంచములో నఖండవిఖ్యాతి నార్జించినవని సేకరించి క్షితీంద్రనాథుఁడు తన మందిరములోని కుడ్యభాగముల నలంకరించిన యమూల్యములగు చిత్తరువులన్నియు నపహరింపఁబడియెను. ప్రధానద్వారమున కెదురుగానున్న గవాక్షము తెఱచియుండెను. దానితలుపులు విరుగఁగొట్టఁబడి యుండెను. ఆ తలుపులలో నొకటి ముక్కలై మనుషుల బందునుండి తలక్రిందుగా వ్రేలాడుచుండెను. గవాక్షమున కానుకొని వెలుపలివైపు నొకబల్ల గోడ కానించియుండెను. దానిప్రక్కనే తీసికొనిపోవుటకు వీలుగా బంగీచేయఁబడిన కొన్ని కుర్చీలుండెను.

రాయలును ఇన్స్పెక్టరును గలసి గవాక్షమునొద్దకుఁ బరుగెత్తి క్రిందనున్న తోఁటలోనికిఁ జూచిరి. అం దెవ్వరును గానబడకపోయిరి. తోఁట కవ్వలివైపున ప్రహరీగోడ వెంబడే నిర్మాణములోనున్న భవనము నిమిత్తమై పరంజాలు కట్టియుండెను. చోరులకు కలయు సౌకర్యములన్నియు సమగ నట్లే కానబడెను. ప్రహరీగోడ దాటుటకు-ఒక పొడుగాటి బలమైన నిచ్చెన-ఒరులు చూడకుండగాఁ దగిన మఱుఁగు నిచ్చుటకు-సగముకట్టుబడిలో నిలచిపోయిన భవనము-దానితరువాత రాజమార్గము ఇఁక నేమికావలయును?

రాయలు గవాక్షమునుండి తిరిగి వచ్చెను. ఎదురుగానున్న గోడపై నాతని కేదియో గోచరించెను. అతఁడు దానిని సమీపించెను.

చిత్తరువులను దీయుటచే వెలితిపోయిన కుడ్యభాగమును జూపుచు నాతఁడు "ఇటు చూడుఁడు" అని నిర్దేశించి పలికెను. అక్కడ నీక్రింది యక్షరములు ప్రస్ఫుటములుగాఁ గానఁబడుచుండెను.

దండధర తులసీదాసు.

"ఇఁక దేవేంద్రవిజయుఁడు రావలసినదే!" అని యిన్స్పెక్టరు హాతాశుఁడై పలికెను. కొంచెమాఁగి "ఈ విషయమును రక్షకశాఖాధ్యక్షునికిఁ దెలియఁజేసి విపుల పరిశీలనార్థమై యిక్కడికిఁ బిలువవలయును." అని పలుకుచు నాతఁడు టెలిఫోనుకడకుఁ బరుగెత్తెను.

మడచుట కనువుగానున్న తలుపులను దెఱచి రాయలు రెండవ మందిరములోనికిఁ జూచెను. అందలి గవాక్షములు తెఱచియుండెను. అక్కడనున్న విలువగల వస్తువులన్నియు నపహృతము లయ్యెను. చిత్రపటములను దీసిన చోట్ల గోడపై "దండధర-తులసీదాసు." అని యక్షరము లుండెను.

ఇన్స్పెక్టరు 'టెలిఫోను'దగ్గఱ గోలగా నఱచుచుండెను. యజమానిని వెంటనే నిద్దురలేపి పంపమని యాతఁడు సేవకు నొకనితోఁ గట్టిగాఁ జెప్పుచుండెను. వాఁడు తాను చెప్పినచొప్పున రక్షకశాఖాధ్యక్షుని లేపి యీ చౌర్యవృత్తాంతము నాతనికిఁ జెప్పినాఁడని నమ్మకము కలుగువఱకు నాతఁడు టెలిఫోనును వదలిపెట్టలేదు. రాయలొక పడకకుర్చీలో బండుకొని యిన్స్పెక్టరు కొఱకు వేచియుండెను. 'టెలిఫోను'లో మాటలాడుట పూర్తియైన పిమ్మట ఇన్స్పెక్టరు ఆ రెండుమందిరములను చోరుల చిహ్నములకొఱకుఁ బరిశీలింపసాగెను. ఆతని కేమియుఁ గాన్పింపలేదు. పరిశీలన పూర్తిగావించి యాతఁ డిట్లనియెను.

"మనమింక గృహనిర్వాహకురాలిని వెదుకవలయును. ఆమె యింకను నిద్రించుచునే యుండవచ్చును. చోరుల సవ్వడి యామెకు వినఁబడియే యుండదు."

"ఇదియంతయును చాలా చిత్రముగా నున్నది." అనుచు రాయలు ఇన్స్పెక్టరును వెంబడించుచు నాగదివీడి వెడలిపోయెను.

ఇన్స్పెక్టరు రక్షకభటులను బిలచెను. వారు గృహసంరక్షకుని కట్లు విడదీసి క్రిందిగదులను బరిశీలించుచుండిరి. వారందరును గలసి మేడ పైభాగములోగల గృహనిర్వాహకురాలి గదిలోనికిఁ బోయిరి.

ఇన్స్పెక్టరు "రాజామాయీ! రాజామాయీ!" అని తలుపుదగ్గర నిలచి కేకలు పెట్టెను. ప్రత్యుత్తరము లేకుండుటచే తలుపును నెట్టెను. తోడనే అది తెఱచుకొనియెను.

లోపల మంచముపై పక్క వేసియుండెను. అది నలిగియుండుటచే దానిపై రాజామాయి శయనించినట్లు స్పష్టమగుచుండెను.

"ఆమె యెచ్చటికిఁ బోయియుండును?" అని రాయలు ప్రశ్నించెను.

"ఎచ్చటికిఁ బోవఁగలదు? ఆ చోరులతోఁ గలసి పోయియుండును. ఆమె వారికి సహాయురాలని నా అభిప్రాయము." అని ఇన్స్పెక్టరు పలికెను.

"క్షితీంద్రనాథుని కీమెయెడ మిగుల నమ్మకమని నేను విన్నాను."

"ఆ నమ్మకమిపుడు నాశము కాఁగలదు. నమ్మకము సంపాదించిన సేవకులే కడకు యజమానిని గోఁతిలో దించువారు."

అతఁడును రక్షకభటులును గలసి భవనమంతయుఁ గలయఁదిరిగిరి. కొదువగదులన్నియును యథాప్రకారముగానే యున్నవి. చోరులు మేడమీఁద చిత్రపటములున్న మందిరములు తప్ప తక్కిన గదులజోలికిఁ బోవలేదని వారు నిర్ధారణ చేసికొనిరి. వారి జాడ యెక్కడను గనబడలేదు. రాజామాయి కూడ గనపడలేదు. ఆమె యదృశ్యయగుటను గురించి భవన సంరక్షకుఁడు కూడ నేమియుఁ జెప్పఁజాలకపోయెను. రాత్రి చీఁకటిలో భార్యాభర్తలు గాఢనిద్రలోనుండఁగాఁ జోరులువచ్చి హఠాత్తుగా వారిని గట్టిపడవైచిరి. వారిముఖములు సైతము చీఁకటిలో వీరికిఁ గనబడకపోయెను.

ఇన్స్పెక్టరును రాయలును గలసి చోరీజరిగిన మందిరములోనికి వచ్చిరి. ఇన్స్పెక్టరు చేతగడియారము వంకఁజూచి 'టెలిఫోను'కడకుఁ బరుగెత్తెను.

"నేను పరిశోధకవర్గాధ్యక్షుని పిలువవలయును." అనియెను.

"తప్పకుండ దేవేంద్రవిజయుని బంపవలసినదని చెప్పుము" అని రాయలు కోరెను.

"దేవేంద్రవిజయుఁడా! రక్షకశాఖాధ్యక్షుఁడగు ఫణినాథసేనునకు నతఁడన్న గిట్టదు."

"ఫణినాథుఁ డెట్టివాఁడు? సమర్థుఁడేనా?" యని రాయలు ప్రశ్నించెను.

"అవును. చాల సమర్థుఁడు."

"నా ఆలస్యముమూలమున చౌర్యము జరిగియుండినయెడల దేవేంద్రవిజయుని పిలిపింపుమని క్షితీంద్రనాథుఁడు ప్రత్యేకముగా నన్నుఁగోరెను. దేవేంద్రవిజయునకును దండధరునకును ఎల్లపుడును సంకులసమరము జరుగుమనే యుండునట్లు తోఁచుచున్నది. అట్టియెడ దేవేంద్రవిజయుఁడు పట్టిన పట్టు వీడక చోరుని వెదకి బంధించి అపహృతములైన యనర్ఘవస్తుసముదాయ

ములను సంపాదింపఁగలఁడు. ఈ కార్యమునకు దేవేంద్రవిజయుఁడే తగిన వాఁడని క్షితీంద్రనాథుని నిశ్చితాభిప్రాయము."

"మంచిది. అట్లే చెప్పెదను." అని ఇన్స్పెక్టరు పలికి 'టెలిఫోను'లోఁ బరిశోధకవర్గాధ్యక్షుని బిలిచెను. అతఁడు చౌర్యవృత్తాంతమును జెప్పి దేవేంద్ర విజయుని బంపుటకుఁ గోరెను. అతని ప్రార్థనకు సుముఖముగు ప్రత్యుత్తరము రాలేదు. రాయలు వెంటనే లేచి టెలిఫోను సమీపించెను. "నేనే స్వయముగా మాటలాడెదను." అని యిన్స్పెక్టరు చేతిలోనుండి దానిని తీసికొని మాటలాడెను.

"నేను రాజగిరి దుర్గాధిపతిని. ఈ చౌర్యపరిశోధనకు దేవేంద్రవిజయునే నియోగించవలసినదని క్షితీంద్రనాథుఁడు కోరియున్నాఁడు. మా ప్రార్థనను మన్నింప గోరెదను."

అవలివైపుననున్న యుద్యోగి తాటస్థ్యము వహించెను ఇన్స్పెక్టరుతోఁ జెప్పినట్లు వ్యతిరేకముగాఁ జెప్ప సాహసింపలేకపోయెను. క్షితీంద్ర నాథుఁడు కోటీశ్వరుఁడు. మాటలాడినవాఁడు రాజగిరి దుర్గాధిపతి. వారి కోర్కెలను నిరాకరించినందువలన గలుగు ఫలమేమి ? దేవేంద్రవిజయుఁడు కార్యాలయములో లేఁడనియుఁ బ్రస్తుత మిరువురు పరిశోధకులను బంపుదు ననియు నా యుద్యోగి బదులు పలికెను. మఱియు నాతఁడు దేవేంద్రవిజయుని వెంటనే రావించి పంపించెదననియుఁ జెప్పెను. రాయ లాతనికి వందన మొనర్చి 'టెలిఫోను' క్రిందఁబడవైచెను.

"బాగుగనే యున్నది. ఫణినాథుఁ డిక్కడకు వచ్చుటు కెంతకాలము పట్టును?" అని రాయలు ఇన్స్పెక్టరు నడిగెను.

"ఇంకొక గంట కావచ్చును. అతఁడు భోజనము చేసికాని బయలు దేఱఁడు. ఒకవిషయము విచారణకుఁ బూనికొనునపుడు ముందుగాఁ దృప్తి తీఱ భోజనముచేసి ప్రారంభించును. పనిలోనికి దిగినతరువాత భోజనమున కవకాశము దొఱకదేమోయని అతని తలంపు." అని ఇన్స్పెక్టరు బదులు పలికెను.

"భోజనము- అవును. అవిషయమే నేను మఱచిపోయితిని. నాకు బాగుగా నాఁకలియగుచున్నది. రాత్రికూడ సరిగ భోజనము చేయలేదు. ఇంకొక గంటవఱకు మనము చేయవలసిన పనియులేదు. ఈలోపుగా నేను భుజించెదను. ఈ భవనమువదలి వెలుపలికిఁ బోవుటకు వీలులేదు. అయినను

గృహసంరక్షకుఁడు నాకుఁ దోడ్పడఁగలఁడు.”

అని రాయలు పలుకుచుఁ గ్రిందికి దిగివచ్చి గృహసంరక్షకుని బిలచెను. వానికి మనస్సు మనస్సులో లేకుండెను. అయినను కావలసిన పదార్థములు సేకరించి తెచ్చుట కంగీకరించెను. రాయ లాతనికొక యైదురూపాయల కాగితము నిచ్చెను. అది తీసికొని వాఁడొక హోటలుకుఁ బరుగెత్తెను.

రాయలు మేడపైకిఁబోయి క్షౌరము చేసికొని స్నానము జేసెను. ఆతఁడు దుస్తులుధరించి క్రిందికి దిగివచ్చుసరికి భోజనము సిద్ధముగా నుండెను. ఆతఁడు కడుపార భుజించెను. తరువాత ప్రధానమందిరములోనికిఁ బోయి యొక సిగరెట్టును వెలిగించి యొకసోఫాపై విశ్రమించెను. కొంతవడికి ఇన్స్పెక్ట రాతనికడకు వచ్చెను. ఆతని ముఖ ముత్సాహజనకముగా లేదు. క్రొత్తగావచ్చిన యిరువురు పరిశోధకులతోఁ గలసి వెదకినను చోరులను గురించిన జాడ లెవ్వియును గానబడలేదని యాతఁడు చెప్పెను.

వారి ప్రయత్నములు విఫలమైనందులకుఁ జింతపడవలదని రాయ లాతని నోదార్చుచుండెను. ఆసమయమున సింహద్వారమునొద్ద మనుష్యుల సందడి వినవచ్చెను. ఇన్స్పెక్టరు చూచివచ్చి

“ఇదిగో! ఫణినాథసేనుఁడు వచ్చినాఁడు. ఇఁక మనము వెళ్లవచ్చును.” అనియెను.

## ౯

# విచారణ

రక్షక శాఖాధ్యక్షుఁడగు ఫణినాథసేనుఁడు భవనములోనికి వచ్చెను. ఆతఁడు స్థూలకాయుఁడై గౌరవర్ణము కలిగియుండెను. ఆతని మీసములు దండ్లుతోముకొను కుంచవలె నుండెను.

“మహాశయా! వీరు రాజగిరి దుర్గాధిపతులు.” అని యిన్స్పెక్టరు రాయల నాతని కెఱుకపఱచెను.

ఫణినాథుఁడు వంగి నమస్కరించుచు “నేఁడు కడుశుభదినము. తమ

పరిచయభాగ్యము కలిగినది కాని యీ సందర్భముమాత్రము ఉత్సాహజనకముగా లేదు." అనియెను.

రాయలును లేచి నమస్కరించెను. అతఁడును దన సంతోషమును దెలిపెను.

"ఇన్స్పెక్టరుగారూ! చౌర్యము జరిగిన తావిదియేనా?" అని ఫణినాథుఁ డడిగెను.

"అవును. ఈ రెండు మందిరములలోనే చౌర్యము జరిగినట్లు కనబడుచున్నది. క్షితీంద్రనాథుఁడు వచ్చువఱకు మన మేమియును జెప్పఁజాలము. పడకగదులలోనుండి యాభరణములు దొంగిలింపఁబడి యుండవచ్చును." అని యిన్స్పెక్టరు పలికెను.

రాయలు:- కొన్నిదినముల వఱకు క్షితీంద్రనాథుఁడెట్టి పనియును జేయఁజాలఁడు. నేను బయలుదేఱుసరికి మతిభ్రమణము గలిగిన వానివలె నుండెను. ఒకరాత్రి ప్రయాణములో నాతనిలోఁ జెప్పదగినంత మార్పేమియును రాఁజాలదు. క్షితీంద్రనాథుఁడు సంపాదించిన అపూర్వవస్తునిచయమంతటి నీ రెండు మందిరములలోనే యలంకరించినాఁడు. కావున చోరులు తక్కిన గదుల జోలికిఁబోయి యుండరు. ఇంకను మిగిలియున్న కళాఖండముల వంకఁ జూడుఁడు. ఆ చిత్రములలోని రంగుల పూతలను బరికింపుఁడు. అలౌకిక నిసర్గ సౌందర్య శోభలుట్టిపడుచున్నవి."

ఫణినాథుఁడు:- దేవర వారికిఁగల కళాప్రీతి విశదమగుచున్నది. వారిని మీరు ప్రాణసమముగ భావించుచున్నారు.

రాయలు:- అవును. వానిని నావిగానే భావించి ప్రేమించుచున్నాను. ఏలయన- వానిని మా మామగారు నాకుఁ గట్నముక్రింద నీయ నిశ్చయించినారు.

ఫణినాథుఁడు:- చాలా నష్టము వాటిల్లినది. అయినను భయములేదు. మేము వెదకి వానిని బట్టి తెచ్చెదము. ఇక్కడ వస్తువులను వేనిని మీరు ముట్టుకొన లేదనుకొందును. అట్లు జేసి యుందురేని నాకు జాడలు దొఱకకుండఁ జేసిన వారగుదురు. ఇన్స్పెక్టరుగారూ! నాకు సకల వివరములను దెలియఁజేయుఁడు.

దండధరుఁడు క్షితీంద్రనాధునికి వ్రాసినయుత్తరమును శేతఁబుచ్చుకొని రాయలు రక్షకభటాలయమునకు వచ్చుటయు, భవనము తాళపుఁ జేతులు మార్పుగాపుటయు, సింహద్వారమును దెఱచుటకుఁజేసిన ప్రయత్నములు, సంరక్షకుఁడు నతనిభార్య బంధింపఁబడియుండుటయు మున్నగు విషయములను ఇన్స్పెక్టరు విశదీకరించెను.

ఫణి:— బహుశః సహాయకులేమో!

రాయలు:- దండధరునికి సహాయకులున్నారా? తెలియక అడుగుచున్నాను. నేను చాలకాలము దేశాటనము నందుండుటచే నాతని ప్రసిద్ధి నెఱుఁగను.

ఫణి:— ధండధరుని ప్రసక్తి ఏమివచ్చినది?

రాయలు:- అట్లుమాటలాడెదరేమి? నాకుఁ గాఁబోవు మామగారికి గడచిన రాత్రి దండధరునుండి యుత్తరమొకటి వచ్చినది. ఆ ఉత్తరము వచ్చుటయే తడవుగ నతివేగముగాఁబోవు రెండు 'మోటారుకారు' లపహరింపఁబడినవి. అదిగో! చూడుఁడు! ఆ గోడమీఁద నాతని సంతకములు!

ఫణి:— దండధరుఁడు! దండధరుఁడు! ప్రతివారికి నాతని నామధేయము మంత్రపఠనమైనది. ప్రతి మస్తిష్కములోను నాతనిపేరు క్రిక్కిరిసిపోయినది. ఆపేరు వినీ వినీ నాకు విసుగెత్తిపోయినది. ఆ ఉత్తరము- ఈ సంతకములు- నిజమైనవి కావు.

రాయలు:- దేవేంద్రవిజయుఁడు కూడ నిట్లే యభిప్రాయపడునా?

ఫణి:- దేవేంద్రవిజయుఁడా! అతనితో మనకేమిపని? అతఁడెప్పుడును దండధరునే కలవరించుచుండును. నిరంతరము దండధరుని స్మరించుటలో నంతటివాఁడు మఱియొకఁడు లేఁడు.

రాయలు:- చౌర్యమును వారించుటకు సకాలములో నేనిక్కడకుఁ జేరలేకపోయితినేని తప్పనిసరిగా దేవేంద్రవిజయుని బిలువనంపవలయునని క్షితీంద్రనాథుఁడు కోరియున్నాఁడు. ఆయనమాటలను మన్నింపకపోయితినేని నన్ను ఎన్నఁటికిని క్షమింపఁడు. కావున నేను దేవేంద్రవిజయునికి 'టెలిఫోను' ద్వారమున కబురంపితిని.

ఫణి:— అలాగునా? ఇదివఱకే కబురుచేసినచో సరియే. కాని-కేవలము అనవసరము. అతని అవసరము నాకుఁ గానబడుటలేదు.

రాయలు:- నాకుఁ దెలియదు. క్షమింపుఁడు.

ఫణి:— అయ్యో! ఎంతమాట! ఇంతలో మునిఁగిపోయినదేమి?

అతఁడు నెమ్మదిగా గదియంతయుఁ గలయఁదిరిగెను. గవాక్షములకడ కొలఁది కాలమాఁగెను. నిచ్చెనవంకఁ జూచెను. తరువాత క్రిందనున్న తోఁటను బరిశీలింపసాగెను.

"దండధరుఁడు! అతని జాడలు అన్నిదిక్కులను దొఱకవు. కాని జాడలే మనకిపుడు శరణ్యములు. అతని తంత్రిమంత్రిము లన్ని వేళలను సాగవు." అని ఫణినాథుఁడు తూష్ణీంభావముతో దీర్ఘరగా ననుకొనియెను.

ఇన్స్పెక్టరు:- అయ్యా! ఇందు తంత్రిమంత్రిములేవియును లేవు. మీమ చిటుక్కుమనకుండ నొక యసాధారణమగు చౌర్యము జరగిపోయి నది.

ఫణి:— అవును. అందావంతేనియు సందేహము లేదు. చోరు లీగవాక్షము గుండఁ బ్రవేశించి యదేమార్గమున వెడలిపోయినారు.

అని యాతఁడొక నిలువైన యినుపపెట్టెవంకకుఁ బోయెను. ఉప యోగములో లేని గుమ్మమునకది యెదురుగా నుండెను. దానిపిడిని త్రిప్పి తలుపుదెఱచుటకు బ్రయత్నించెను. కాని పిడి తిరుగలేదు. అది తాళము వైచియుండెను.

"నేను తెలిసికొనునంతవఱకు చోరులు దీనిని ముట్టుకొనలేదు." అని యాతఁడనియెను.

రాయలు:- భగవదనుగ్రహము కలుగునుగాక! క్షితీంద్రనాథుఁడు దన యమూల్యములగు నాభరణములను దీనిలోనే భద్రము సేయునఁట! పద్మరాగమణిప్రభారంజితమగు కిరీటము సైతము—"

ఫణి:— ఏమిటి? అశోకచక్రవర్తి కిరీటమా?

రాయలు:- అవును.

ఫణి:— ఇన్స్పెక్టరుగారూ! మీరు చెప్పినదానినిబట్టి దండధరుఁడు వ్రాసిన ఉత్తరములో నీ కిరీటముగూడఁ దీసికొనపోయెదనని వ్రాసినాఁడు కాదా?

రాయిలు:- అవును. ఆ కిరీటమునుగూడ దప్పక కొనిపోయెదనని వ్రాసినాఁడు.

ఇన్స్పెక్టరు:- ఇది మఱియొక నిదర్శనము. ఫణీనాథ మహాశయా! అతఁడు చేసిన ప్రతిజ్ఞను తప్పక నిర్వహించియుండును.

ఫణి:— ఈ భవనమెవరి వశమున నున్నది?

ఇన్స్పెక్టరు:- భవన సంరక్షకుఁడు-అతని భార్య. ఒక గృహనిర్వాహకురాలు-రాజామాయి ఆమె పేరు.

ఫణి:— నేను సంరక్షకుని వానిభార్యను విచారింపవలయును. వారిని పడక గదిలోఁ గట్టిపడవైచియుండఁగా మీరు చూచినారా?

ఇన్స్పెక్టరు:- అవును.

ఫణి:— గృహనిర్వాహకురా లెచ్చట నున్నది? నే నామెను జూడవలయును.

ఇన్స్పెక్టరు:- ఆమె యెచ్చటనున్నదో మాకును దెలియదు.

ఫణి:— మీకును దెలియదా?

ఇన్స్పెక్టరు:- మే మామెను కనుగొనలేకపోతిమి.

ఫణి:— అలాగునా? ఇంకేమి? సహాయకురాలిని దెలిసికొన్నాము. మన మామెను కనుగొనలేక పోయినప్పటికిని ఆమె సహాయకురాలని తెలిసికొన్నాము.

రాయలు:- ఆమె సహాయకురాలు కానేఱదు. క్షితీంద్రనాథునికిని ఆయన కొమార్తె జయంతిశ్రీకిని ఆమెయందు గాఢమైన విశ్వాసము గలదు. నిన్న రాజగిరికి టెలిఫోనులో సమాచారములు చెప్పినది. ఆభరణములన్నియు నామె వశమందే యుండెను. వివాహమునకు వచ్చిన బహుమతులన్నియు నామెయే భద్రముసేయుచుండెను.

ఫణి:— ఆ యాభరణములు-పరిణయ బహూకృతులు-అవికూడ దొంగిలింపబడినవా?

రాయలు:- వానిని ముట్టుకొనినట్లు లేదు. అయినను క్షితీంద్రనాథుఁడు వచ్చి చూచినతరువాతగాని చెప్పఁజాలను. నాకుఁ దెలిసినంతవఱకు-చోరు లీ రెండుమందిరములలో మాత్రమే దోపిడి చేసినారు.

ఫణి:— ఇన్స్పెక్టరుగారూ! మీ రామూలాగ్రముగ నీభవనము నంతటినీ వెదకి యుండరు. విశ్వసనీయురాలైనపక్షమున గృహ నిర్వాహకురాలెక్కడనో యొక చోటనుండఁగలదు. మీరు ప్రతిగదిని వెదకినారా?

ఇన్స్పెక్టరు:— ప్రతి గదిని- ప్రతి పటువుకిందు- ప్రతి మూలను- ప్రతి

అలమారను- సర్వ స్థలములను వెదకినాము.

ఫణి:— చినిఁగినగుడ్డలు కాని- రక్తపుజాడీలు కాని- హత్యజరిగిన చిహ్నములు కాని- యింక మఱియే యితరములగు గుఱుతులు కాని- కనబడలేదా ?

ఇన్స్పెక్టరు:— ఏవియును గనబడలేదు.

ఫణి:— చాలా నిరుత్సాహముగాఁ గనబడుచున్నది. ఆమె యెచ్చట నిద్రించినది ?

ఇన్స్పెక్టరు:- ఆమె గదిచివరి యంతస్తులో నున్నది. ఆమె పడకపై నిద్రించినట్లు తోఁచుచున్నది.ఆమె వస్త్రములేవేని తనవెంటఁ గొనిపోయినట్లు గన్పట్టదు.

ఫణి:— ఇది చాలా చిత్రముగా నున్నది. బహు క్లిష్టమైన సమస్యగాఁ బరిణమించుచున్నది.

రాయలు:- బహుశః దేవేంద్ర విజయుఁడు కొన్ని జాడలు తీయఁగలఁడని కొనియెదను.

ఫణినాథుఁడు ముఖము ముడుచుకొని

"అవును. అవును. దేవేంద్రవిజయుఁ డిట్టివిషయములలో గొలఁదిపాటి సహాయము చేయఁగలఁడు. అతఁడు ప్రతివిషయమును దండధరునికి ముడి వేయఁగలఁడు. అహోరహము దండధరుని నామస్మరణము జేయుచుండుటచే నాతనికట్టి సామర్థ్య మలవడినది." అనియెను.

రాయ లప్రయత్నముగ వంగి బల్లమీఁదినుండి క్రిందఁబడిన యొక పుస్తకమును పైకెత్తెను.

ఫణినాథుఁ డాతురతతో "క్షమింపుఁడు. క్షమింపుఁడు. దయవహించి మీరు ఏవస్తువును ముట్టుకొనవలదు." అని వారించెను.

"చూడుఁడు. ఇది చిత్రముగా నున్నది." అని రాయలనియెను.

ఫణి: — ఏది చిత్రముగా నున్నది ?

రాయలు:- ఇదిగో ! ఈ పుస్తకము చోరులచేఁ గ్రిందఁబడఁ ద్రోయబడినట్లు కనబడుచున్నది కాని చూడుఁడు ! నిజముగా దానిక్రింద నీ రత్నకంబళముపైఁ బాదచిహ్న మున్నది.

ఫణినాథుఁడును ఇన్స్పెక్టరును పరుగు పరుగున నచ్చోటికి వచ్చిరి. పుస్తకము పడియున్న తావున నిజముగా రత్నకంబళముపైఁ దెల్లగా నొకపాద చిహ్న మగపడుచుండెను. వారిరువురును దానివంకఁ దేఱిపాఱఁ జూడసాగిరి.

ఫణి:— ఇది సీమసున్నమువలెఁ గనబడుచున్నది. సీమసున్న మిచటి కెట్లు వచ్చినది ?

రాయలు:- చోరులు బహుశః తోఁటలోనుండి వచ్చియుందురు.

ఫణి:— అవును. వారు తోఁటలోనుండియే వచ్చిరి. ఇంక మఱి యెచ్చట నుండి రాఁగలరు ?

రాయలు:- తోఁట కవ్వలివైపున నొక భవనమును నిర్మించుచున్నారు.

ఫణి:— అవును. సున్నముతోఁగూడిన పాదములతో చోరు లిచటికి వచ్చిరి. వారు పోవునపుడు కంబళిమువైఁబడిన పాదముద్రలన్నింటిని దుడిచివైచిరి. కాని పుస్తకమునుదీసి దీనిని దుడిచివైచుట మాత్రము మఱచిపోయిరి. వారు తోఁటలోనుండియే ప్రవేశించి మఱల నదే మార్గమున నిర్గమించిరని తక్కినజాడలరీతిగా తెలియఁజేయుట తప్ప యీ పాదచిహ్నము ఎక్కువ ప్రయోజనకారి కాజాలదు. ఈ నిచ్చెన - పగమునకుఁబైగా గవాక్షమునకు వెలుపలనున్న ఆబల్ల-అదేవిషయమును ధ్రువపఱచుచున్నవి. అయినను ఈ పాదచిహ్నము మఱియొకరీతిగా నుపయోగపడవచ్చును. ఇన్స్పెక్టరుగారూ! ఆ పాద ముద్రను కొలిచి 'ఫోటో' తీయుఁడు. ఇదిగో! కొలతబద్ద"

అని ఫణినాథుఁడు పలుకుచుఁ దన జేబులోనున్న దంతపు కొలతబద్దను దీసి యిన్స్పెక్టరుచేతి కిచ్చెను. అతఁడు మోకాళ్లపైఁ గూరుచుండి యాచిహ్నమును గొలిచెను.

ఫణి:— తోఁట కవ్వలివైపున నిర్మాణములోనున్న యాభవనమును నేను పరిశీలింపవలయును. అక్కడ పెక్కుజాడలు నిశ్చయముగాఁ గన బడఁగలవు.

ఇన్స్పెక్టరు ఆ పాదచిహ్నము కొలతను తన 'నోటుబుక్కు'లో వ్రాసికొనియెను. సింహద్వారమునొద్ద నెవరో పిలిచిన సవ్వడి వినవచ్చెను.

ఫణి:— దీనితో సమానములైన పాదముద్రలను పెక్కింటిని ఆ భవనము లోని సున్నపు గుట్టదగ్గఱ నేను చూడఁగలను.

అని యాతఁడు తన నిశ్చితాభిప్రాయమును వెలిఁబుచ్చెను.

ఒక రక్షకభటుఁడు ప్రవేశించి వారికి నమస్కరించుచు నిట్లు నివేదించెను.

"అయ్యా! రాజగిరి దుర్గమునుండి సేవకులు వచ్చినారు."

ఫణి:— వారిని సేవకుల గదులలో వేచియుండుఁడని చెప్పుము.

ఫణినాథుఁడు రెండు నిమిషము లాలోచనాధీనుఁడై నిశ్శబ్దముగా నుండెను. తరువాత రాయలవంకకుఁ దిరిగి

"మీరు రాజగిరి దుర్గములో మోటారుకారులు దొంగిలింపఁబడినట్లు చెప్పినారుకాదా ? ఆ విషయము విపులముగాఁ దెలియఁజేయుఁడు." అని అడిగెను.

రాయలు:- దండధరుని యుత్తరమును జూడఁగనే క్షితీంద్రనాథుఁ డిచ్చటికి వచ్చుటకుఁ బయనమయ్యెను. 'మోటారుకారు'ల కొఱకు కబురంపగాఁ నవి దొంగిలింపఁబడియెను. "కారు డ్రైవరు"ను మఱియొక సేవకుఁడును శకటశాలలో బంధింపఁబడి యుండిరి. ఒక పాతకారు మాత్రము మిగిలియుండెను. తక్కినవారి నందఱను 'రైలు'లో రమ్మనమనిచెప్పి నేనాకారులో నీ నగరమును జేరుకొంటిని.

ఫణి:— ఇది చాల ముఖ్యమైన విషయము. ఆ మోటారుకారులేనా లేక యితరవస్తువులేవేని దొంగిలింపఁబడినవా ?

రాయలు:- అవును. నిజమునకు-మఱియొక దొంగతనము జరుగుటకు ప్రయత్నము చేయబడెను. ఆ చోరులు సుజీవరులను పేరులతో దుర్గభవనమును ప్రవేశించిరి. ఒకఁడు తండ్రి ముగ్గురుకొడుకులు వారు మోటారుకారులను కొను మిషతో వచ్చిరి. క్షితీంద్రనాథుఁడు ఒక మోటారుకారును విక్రయించుటకు నుద్దేశించినట్లు పత్రికలలోఁ బ్రకటించెను. వారు వచ్చి క్షితీంద్రనాథునికొఱకు దుర్గప్రధాన మందిరములో వేచియుండిరి. క్షితీంద్రనాథుఁడు వచ్చెను. వారు మందిరమును విడచి పోవునప్పుడు వారిలో నొకఁడు నేను క్షితీంద్రనాథుని కొమార్తెకు అంతకుఁబూర్వమే బహుకరించిన పచ్చలపతకమును దొంగిలించుటకు యత్నించెను. సకాలములో నాతని నేను పట్టుకొని ఆ పచ్చలపతకమును వానినుండి గ్రహించి రక్షించితిని.

ఫణి:— మంచిది. వేచియుండుఁడు. వారిలో నొకఁడైన దొఱికినాఁడు. వానిని తరువాత విచారణ చేయుదము.

రాయలు:- వాఁడు దొఱకలేదు. వాఁడు మనకిపుడు వశ్యుఁడై లేఁడు.

ఫణి:— ఏమీ ? లేఁడా ? వాఁడు పోలీసువారినుండి తప్పించుకొని పోయి నాఁడా ?

రాయలు:- లేదు. నేను పోలీసువారికి ఫిర్యాదు చేయలేదు.

ఫణి:— పోలీసువారికి ఫిర్యాదు చేయలేదా ?

రాయలు:- లేదు. వాఁడు కడుచిన్నవాఁడు. నా కాళ్లపైఁబడి యేడ్చినాఁడు. నాకు జాలికలిగినది. పతకము దొరికినదిగదాయని వదలివైచితిని.

ఫణి:— ప్రభూ! ఇదియా మీరు సంఘమునకుఁ జేయుసేవ !

రాయలు:- మహాశయా! క్షమింపుఁడు. ఆసమయమున నెక్కుడలేని మనో దౌర్బల్యము నన్నావహించినది.

ఫణినాథుఁడు చేతులు ముడుచుకొని యటునిటు నడయాడసాగెను. అతఁడు తటాలునవాఁగి యధికారసూచకసంతస్వరముతో నిట్లుపలికెను.

"రాజగిరి దుర్గములోని దొంగతనములకును-ఈ మందిరములలోని చౌర్యమునకు నత్యంత సన్నిహిత సంబంధమున్నది. దీనిలో నించుకేనియు సందేహము లేదు."

రాయలును ఇన్స్పెక్టరును అతనివంక గౌరవపూర్వకములైన వీక్షణములను బ్రసరించిరి.

ఫణి:— నేను సూత్రములను సవరించుకొనుచున్నాను. ఇన్స్పెక్టరుగారూ! మీరుపోయి గృహసంరక్షకుని నతని భార్యను దీసికొనిరండు! చౌర్య స్థలమును గురించి వారిని నేను ప్రశ్నింపవలయును.

ఇన్స్పెక్టరు వెడలిపోయెను. ఫణినాథుఁడు దీర్ఘాలోచనా మగ్నుఁడయ్యెను.

రాయలు:- ఇదియంతయును చిత్రముగాఁ గనబడుచున్నది.

ఇన్స్పెక్టరు భార్యాభర్తల నిరువురను గొనివచ్చెను. అతఁడొక కాగితమును ఫణినాథున కొసంగెను. ఆ గృహసంరక్షకుఁడు అరువదేండ్ల ప్రాయమువాఁడు. వాని భార్యకేఁ బదియైదేండ్ల వయస్సు. వారు భయభ్రాంతులై ఫణినాథునివంక దీనవదనములతోఁ జూడసాగిరి. ఫణినాథుఁడు కుర్చీలోఁ గూరుచుండి సావధానముగా నాకాగితమును జదువుకొని వారిని నిశితదృష్టులతోఁ బరీక్షింపసాగెను. కొలఁదిసేపటికి-"మీ మనస్సులు కుదుటఁ బడినవా ?" యని ప్రశ్నించెను.

"పడిసవి స్వామీ! వారు మమ్ములను బెదరించి బంధించినారు. కాని గాయపఱచలేదు." అని వాడు బదులుపలికెను. కాని వానిభార్య కొంచెము గయ్యాళిమనిషి.

"బాబూ! ఏపాపమెఱుగని స్త్రీలను శాంతముగా నిద్రింపనీయకుండ నిట్లుబంధించుట అవమానకరము. పోలీసువారు జాగ్రత్తగానుండు నెడల నిట్టి సంఘటనలు జరుగజాలవు." అని యావృద్ధ పలికెను.

ఫణి:— మీరు నిద్రించుచుండగా నాకస్మికముగ జోరులు మిమ్ములను బంధించినారా? మీరేమియును చూడలేదా? ఏమియును వినబడలేదా ?

వృద్ధుడు:- వినుటకును చూచుటకును అవకాశమే లేకుండెను.

ఫణి:— తోటలోని బదధ్వనుల సందడి మీకు వినబడలేదా ?

వృద్ధుడు:- మా గదిలోనున్నవారికి తోటలోని శబ్దములు వినబడవు.

ఫణి:— సింహద్వారమునొద్ద చప్పుడు వినబడలేదా ?

వృద్ధుడు:- మాకెట్టి శబ్దమును వినబడలేదు.

ఫణి:— అట్లయినచో రాత్రియంతయును మీకెట్టి శబ్దమును వినబడలేదా ?

వృద్ధుడు:- మమ్ములను కట్టిపడవైచినపిదప చాల సందడి వినబడినది.

ఫణి:— ఇది చాల ముఖ్యము. మీకెట్టిసందడి వినంబడినది ?

వృద్ధుడు:- వస్తువులు పరస్పరము డీకొన్నశబ్దములు- మనుష్యులు నడచిన చప్పుడు-

ఫణి:— ఎక్కడనడచినట్లు వినబడినవి ?

వృద్ధుడు:- మాకు పైనున్న మందిరములో-

ఫణి:— పోరాటము జరిగిన సందడి వినబడినదా? ఒకరిని బలవంతముగా దీసికొనిపోవుచున్నట్లు కేకలు-అఱపులు-బెదరింపులు-

భార్యాభర్త లిరువురు నొకరిమొగమువంక మఱియొకరు చూచుకొనిరి.

వృద్ధుడు:- నాకు వినబడలేదు.

వృద్ధ:— నేనును వినలేదు.

ఫణినాథుడు కొంత తడవాగెను. తరువాత "మీ రెంత కాలమునుండి క్షితీంద్రనాథుని కొలువులో నున్నారు?" అని ప్రశ్నించెను.

వృద్ధుడు:— ఒక సంవత్సరము పైకాలమునుండి- ఫణినాథుడు చేతనున్న

కాగితముఁ బంకఁ జూచి ముఖము ముడిచికొని రూక్షవీక్షణములను ప్రసారించును "ఓయీ! నీకు రెండుపర్యాయములు శిక్షపడినట్లు తెలియుచున్నది." అని కఠినముగాఁ బలికెను.

వృద్ధుఁడు:- నిజమే- కాని-

వృద్ధ:— అయ్యా! నామగఁడు న్యాయవర్తనము గలవాఁడు. మీరు క్షితీంద్రనాథ మహాశయులను విచారింపుఁడు. వారు-

ఫణి:— నీ వూరకుండుము. ఓయీ! నీ మొదటిశిక్ష ఒకరోజు ఖైదు. రెండవ శిక్ష మూఁడుదినముల ఖైదు. నిజమేనా ?

వృద్ధుఁడు:- నిజమే! నేను కాదనుటలేదు. కాని అవి రాజకీయములు.

ఫణి:— రాజకీయములా ?

వృద్ధుఁడు:- అవును. నేను దేశభక్తుల సేవలో చాలకాలమండి పనులు చేసితిని. వారితోఁబాటు నాకు నట్టిశిక్షలు లభించినవి.

ఫణి:— మంచిది. ఇఁక మీరు పోవచ్చును.

భార్యాభర్త లిరువురును వెడలిపోయిరి. వారి ముఖభంగిమలలో నెట్టి మార్పులును లేకపోయెను.

ఫణి:— నేను పొరబాటుపడనయెడల నీ మూర్ఖులు నిజము చెప్పినారనియే భావింతును.

రాయలు:- వారు న్యాయప్రవర్తనము గలవారనియే తోఁచుచున్నది.

ఫణి:— మనమిపు డీభవనమంతటిని పరీక్ష సేయుదము.

రాయలు:- నేనుకూడ వత్తును. రావచ్చునా ?

ఫణి:— అయ్యో! మీరు తప్పకుండ రావలయును.

రాయలు:- చిత్రము. అంతయు చిత్రముగా నున్నది.

## ౧౦

# దేవేంద్ర విజయుఁడు

ప్రధానమందిర ద్వారమున నొక రక్షకభటుని గాపుంచి ఫణినాథుఁడును, రాయలును, ఇన్స్పెక్టరును భవనమంతటిని పరీక్షించుటకు బయలు

జేతిగి. ఫణినాథుఁడు ప్రతిగదిని అత్యంతమగు శ్రద్ధతోఁ బరిశీలింపసాగెను. ఆ పరిశీలన గంటల పర్యంతము సాగిపోవుచుండెను. అతఁడు రాజామాయి గదిని చాలాసేపు పరీక్షించెను. చోరులు లామెను హత్యగావించి అమూల్య వస్తుసామగ్రితోఁ బారిపోయియుందురని యాతని నిశ్చయము. హత్యా కాండకు నిదర్శనముగ రక్తపు మరక లగపడకపోయినను కొంత మసిపూసినను వంచించి యుందురని యాతని విశ్వాసము. ప్రతివిషయములోను ఇన్స్పెక్టరు ఆతనితో నేకీభవించుచుండెను. అందుచేత ఇన్స్పెక్టరునైన నాతనికి సదభిప్రాయ ముదయించెను. విషయ విశదము జేసి పరిశీలకుల నిర్ణయపద్ధతులలో తన యపూర్వప్రతిభా కౌశలమును గాంచువారిల ప్రకాశించుట కవకాశము గల్గించినందుకు ఫణినాథుఁడు మనస్సులో ననంతమగు సంతృప్తిభావమును బొందెను.

భవనమంతటిని బరీక్షించినపిమ్మట ఫణినాథుఁడు తోఁటలోనికిం బోయి దానిని బరీక్షింపసాగెను. వాన వెఁదడిసిన మెత్తని నేలపై నిశ్చిత గల తావున లేఁతపచ్చికమీఁదఁ గొన్ని పాదచిహ్నము లగపడెను. ఆ ప్రాంత మందు ఇంకను కొన్ని పాదచిహ్నములు గానబడియెను. సంవిధము లగు వస్తువులను దొంగిలించుకొని పోవుటలోఁ జోరులు చాల ప్రయాసముల నొందిరని వెలుపలికి దిగిన పాదచిహ్నములు విశదము సేయుచుండెను. ఆ చిహ్నములు క్రమముగా కంకర వైచిన మార్గముమీఁదికిఁ బోయెను. ఫణినాథుఁడు వాని ననుసరించుచుఁ దోఁట ప్రహరీగోడ ద్వారమును దాఁటి నిర్మాణములోనున్న భవనము ఆవరణములోనికిఁ బ్రవేశించెను

ఫణినాథుఁడు భావించినట్లే యా యావరణలో పలుతావుల సున్నపు గుట్టలుండెను. వానిచుట్టును పాదచిహ్నము లుండెను. వానివంక ఫణినాథుఁడు దృష్టులు కేంద్రీకరించి చూచెను. వాని కొలతలు తీసికొని మేడపైన దీసికొన్న పాదముద్రికొలతలతో సరిపోల్చి చూడమని యాతఁడు ఇన్స్పెక్టరుతో సూచనగానైన చెప్పలేదు.

సగముకట్టిన మేడచుట్టును వారుతిరుగుచు నేలయంతటిని వారు పరిశీలించుచుండఁగా క్షితీంద్రనాథుని భవనము రెండవ యంతస్తులోనుండి యొక పురుషుఁడు చకచక మెట్లుదిగి క్రిందికివచ్చెను. అతఁడు సామాన్యపురుషునివలె నుండెను. వయస్సు నలుబది ఏబది మధ్యలోనుండెను. అతఁడు పొట్టియును గాక పొడవునుగాక సమున్నత దృఢకాయుఁడై యుండెను. అతని అవయవములు

వేషభాషలన్నియును సాధారణముగానే యుండెను. కాని యాతని కన్నుల నుండి యొక యసాధారణ తేజస్సు బహిర్గతమగుచుండెను. ఆ దృక్కులు ఎదుట నున్న వారి హృదయముల జీల్చుకొని అంతరాళములోని మర్మములను భేదించి తెలిసికొన సమర్థములై యుండెను. అతడే సుప్రసిద్ధ అపరాధ పరిశోధకుడగు దేవేంద్రవిజయుడు. దండధరునకాజన్మ విరోధి.

ప్రధానమందిరమునొద్ద కాపున్న రక్షకభటుడు దేవేంద్రవిజయుని గుర్తెరిగి నమస్కరించెను.

రక్షక:— అయ్యా! తమరు వచ్చినారని ఫణినాథునితో విన్నవింతునా?

దేవేంద్ర:- అక్కరలేదు.

అతడు చౌర్యము జరిగిన మందిరములోనికిబోయి యన్నివైపులను కలయజూడసాగెను. అతనిపై ఖరదిపామంతియు గన్నులు పెట్టుకొని చూచుచున్నట్లుండెను.

రక్షక:— ఫణినాథ మహాశయులును ఇన్స్పెక్టరుగారును ఇప్పుడే గృహ సాంగణములోని గదిని వెదకబోయినారు. అది మేడపై భాగమున నున్నది. ఈ త్రోవగుండ బోవచ్చును. నేను మిమ్ములనక్కడకు గొని పోవుదునా?

దేవేంద్ర:- అక్కరలేదు. నాకుదెలియును. నే నక్కడనుండియే వచ్చుచున్నాను.

రక్షకభటుడు ఆశ్చర్యముతో నోరు తెరచెను.

రక్షక:— దేవేంద్రమహాశయా! పరిశోధనలో మీ రగ్రగణ్యులు. మిమ్ములను మించినవారు లేరు.

దేవేంద్ర:- నీ వట్లు మాటలాడగూడదు. అట్టిభావము నీ మనస్సులో నుండవచ్చును కాని దానిని ప్రకటింపగూడదు.

దేవేంద్రవిజయుడు గవాక్షము వంకకు నడచెను. రక్షకభటుడాతని వెంబడించి యక్కడనున్న నిచ్చెనకొనను గట్టిగాబట్టుకొని

“మహాశయా! దీనిని మీరు చూచినారా? చోరు డీమార్గముననే వచ్చి వెడలిపోయినట్లు తోచుచున్నది” అనియెను.

దేవేంద్ర:- మంచిది.

రక్షక:— ఈ బల్లనుసైతము గవాక్షమున కానించి పెట్టినారు.

దేవేంద్ర:- అవును. అవును.

రక్షకః:— ఇది దండధరుని పనికాదని వారి అభిప్రాయము. దండధరుని యుత్తరము నాతని సంతకములును నిజములు కావని-

దేవేంద్ర:- అలాగునా ?

రక్షక:— నేను మీకుఁ జేయఁదగిన సహాయమేదైనా గలదా ?

దేవేంద్ర:- ఉన్నది. నీవు వాకిటఁ గాపుండి ఫణీనాథుని, ఇన్స్పెక్టరును, పరిశోధకులను దప్ప తక్కినవారిని లోనికి రానీయకుము.

రక్షక:— రాజగిరి దుర్గాధిపతి శ్రీ తుషారకాంతిరాయలు ఉన్నారు. వారు ఈ విషయములో నత్యంతశ్రద్ధ వహించుచున్నారు.

దేవేంద్ర:- వారినిగూడ లోనికి రానీయవచ్చును.

రక్షకభటుఁడు వెంటనే నిర్ణీతస్థానమునకు వెడలిపోయెను.

ద్వారము మూసినవెంటనే దేవేంద్రవిజయుఁడు విద్యుత్ప్రవాహికవలె చైతన్యము వహించెను. అతఁడు నిశ్రేణికను, కుడ్యభాగములను, దండధరుని సంతకములను నిశితముగాఁ బరిశీలించెను. పదచిహ్నము చెదరిపోవకుండునట్లు దానిమీఁద గాజులు పెట్టిన పుస్తకమును దేవేంద్రవిజయుఁడు లేవనెత్తి చూచెను. తరువాత నా పాదముద్రికను గవాక్షమునకును మధ్య గల దూరమును జానడుగులు వైచి కొలచెను.

ఆ పరిశోధన యొక్క ఫలితమాతనికిఁ దృప్తిని గలిగించినట్లు లేదు. అతఁడు ముఖము ముడిచికొని మఱియొక పర్యాయము కొలిచి చూచెను. తరువాత నేమియుఁ దోఁచనివానివలె గవాక్షమునుండి శూన్యదృష్టులతో బాహ్యప్రపంచమును దిలకింపసాగెను.

ఎట్టకేల కాతఁడొక నిశ్చితాభిప్రాయమునకు వచ్చినట్లు కానబడెను. అతఁడు గవాక్షమును వీడి జేబులోనుండి భూతకద్దమును దీసి కాలుసేతులు భూమిపైమోపి క్రిందపఱచియున్న రత్నకంబళమును మిక్కిలి శ్రద్ధతోఁ బరిశీలింపసాగెను.

అతఁడు ఆరడుగుల చదరపు మేరను బరిశీలించెను. తరువాత గది యంతయుఁ గలయఁజూచెను. నిలువఁబెట్టియున్న [illegible] చట్రపుటెల కాళ్ల మధ్యనుండి దాఁగియున్న వలయాకార ప్రదేశ మొకటి యాతనికిఁ గోచరమయ్యెను. ఆ ప్రదేశమందొక యడుగు ఎత్తున వితర్దియు దానిపై విద్యుత్ప్రవాహ సంచాలితమగు నొక యాలమార (Frigidaire) పెట్టుటకుఁ దగినఏర్పాటు చేయబడియుండెను. అతిలాఘవముగ నమర్పఁబడిన 'స్ప్రిను'

మూలయందు నా ప్రియశిష్యుడు గుప్తముగానుండి నిలువఁబడియున్న వారలకుఁ గానరాకుండెను. దానిని జూచి దేవేంద్రవిజయుఁడు సంతృప్తభావముతోఁ దల యూఁచెను. అతఁడు లేవకుండ నేలపైఁ బాఁకుచునే గోడ కెలనదాఁపి దానిచుట్టును దిరిగి పరీక్షించి చిరునగవుతో లేచి నిలువఁబడి యెను.

అతఁడు ప్రక్కనున్న రెండవ మందిరములోనికిఁ బోయి దానినిగూడ నట్లు జాగరూకతతోఁ బరిశీలించెను. భూతద్దముతో రత్నకంబళిమీఁదను గోడల పరీక్షించెను. నిచ్చెన వేసిన గవాక్షముకడకు వచ్చి పగులగొట్టియున్న కిటికీతలుపులను నిశితముగాఁ బరికించి చూచెను. తరువాత నొక సిగరెట్టును వెలిగించి గవాక్షమునకుఁ జేరగిలఁబడి గోడకాళమువంక శూన్యదృష్టులను బ్రసారించుచు నిలుచుండెను. కాని అతని మనస్సు తాను కనుగొన్న విషయములపైఁ బూర్ణముగా లగ్నమైయుండెను.

అతఁడట్లే పదినిమిషముల పర్యంతము మేకాగ్రచిత్తముతో నాలోచనాధీనుఁడై నిలువఁబడియెను. అప్పుడు కంఠస్వరములును మేడనెక్కుచున్న పదధ్వనులును వినఁబడెను. అవి యాతని సమాధికి భంగము గలిగించెను. అతఁడు వెంటనే చకితుఁడై గవాక్షముకడనుండి నిచ్చెనదిగి యదృశ్యుఁడై పోయెను.

ద్వారముఁ దెఱచికొని ఫణినాథసేనుఁడును, రాయలును, ఇన్స్పెక్టరును లోనికివచ్చిరి. ఫణినాథుఁడా మందిరమంతయుఁ గలయఁజూచి రెండవ మందిరములోనికిఁ బోయి దానినిగూడ నట్లేచూచి తిరిగివచ్చెను. అతఁడు ద్వారముకడనున్న రక్షకభటుని జూచి "దేవేంద్రవిజయుఁ డిక్కడలేఁడు." అనియెను.

రక్షక:— వారిని నే నిక్కడనే వదలిపెట్టితిని. వారు మాయమైయుండ వచ్చును.

ఫణి:— అవును. అతఁడా నిచ్చెనదిగి క్రొత్తగాకట్టుచున్న భవనమును పరీక్షింపఁబోయినాఁడు. మనము చేసినపనినే యాతఁడు మరల చేయుచున్నాఁడు. ఈ వృథాశ్రమ యెందులకు? తనకుఁ గావలసిన విషయములన్నింటిని మనమే చెప్పియుంటిమి.

రాయలు:— మనము జారవిడిచినదాని నాతఁడు కనిపెట్టవచ్చును.

ఫణినాథుఁడు ముఖము ముడిచికొనియెను.

"అట్లైనప్పటికిని గానేఱదు. నింతగ నుభవ మెంత లోపరహితముగఁ గార్యనిర్వహణ మొనర్చునో దేవరవారు గ్రహించినట్లు లేదు." అని పలికి గాఢాలోచనము జేయుచున్నవానివలె నాతఁడా మందిరములో బచారు చేయసాగెను.

"ఆలోచించుకొలఁది ఈ విషయములో దండధరుని ప్రసక్తి యణుమాత్రమైనను లేదని నిశ్చయముగా విశదమగుచున్నది. ఇది దండధరుని వంటి యసాధారణ మేధావి చేసిన పని కాదు. ఎవఁడో సామాన్యచోరుఁడు చేసినది ఇన్స్పెక్టరుగారూ! మీ యభిప్రాయమేమి?" యని ఫణినాథుఁడు ప్రశ్నించెను.

ఇన్స్పెక్టరు:- మీ యభిప్రాయమే నాయభిప్రాయము.

ఫణి:— కాని దేవేంద్రవిజయుఁడు మనతో నేకీభవింపఁడు.

రాయలు:- అతఁడు సులభముగా నొకరి యభిప్రాయము నొప్పుకొనువాఁడు కాఁడనుకొందును.

ఫణి:— అట్లు కాదు. ఒక్క దండధరుని విషయములోఁ దప్ప కొదువ విషయములలో నాతఁ డందఱితో నేకీభవింపఁగలఁడు. దండధరునితోఁ గూడిన యభిప్రాయము లాతని నొక జాడ్యమువలె నావేశించినవి.

రాయలు:- కాని-అతఁడు దండధరు నెన్నఁడును బట్టుకొనినట్లు లేదు.

ఫణి:— లేదు. పట్టుకొనజాలఁడు. దండధరుని పేరు చెవిసోకినంతనే యాతఁడు విక్షుబ్ధుఁడై నిలువెల్ల కంపించి సమస్తశక్తులను గోల్పోవును.

ఫణినాథుఁడు మఱల పచారుచేయసాగెను. అట్లు చేయుచు నొక్కింత తడవాఁగి మఱల నిట్లు పలికెను.

"ఈ విషయముల నాలోచించి - ముఖ్యముగా దౌర్జన్యము జరిగిన చిహ్నము లేవియును గానరాకుండఁ జేసి - మనిషి కనబడకుండ మాయ మగుటయు మున రాజామాయియే యీ రహస్యమునకు మూలకారణమను నిర్ణయమునకు వచ్చినాను. ఆమె చోరులకు సహాయకారిణి. ఆ మెగదిలోఁ బడకున్నఁ నిగురింపలేదు. మనలను మోసగించుటకు మాత్రము మంచమునఁ బక్కకై చుకొనినది. చౌర్యము జేయుటకై సాయము చేసిన వ్యక్తిని గనుగొన్నాము గనుక మనము కొంతవఱకుఁ గృతకృత్యుల మైనట్లే."

రాయలు:- ఆమె నిజముగా సహాయము జేసినదనియేనా మీ నిర్ధారణ ?

ఫణి:-- అవును. ముమ్మాటికిని నిశ్చయముగ-మనము మరల నొకసారి యామె గదిలోనికిఁ బోయి పరిశీలింతము.

దేవేంద్రవిజయుని తల గవాక్షముకడఁ బైకిలేచెను. అతఁడు "ఫణినాథ మహాశయా! మీరట్టి ప్రయాసపడవలసిన యావసరము లేదు." అనియెను.

ఫణినాథుఁడు డబ్బురపాటుతో నోరు తెరచెను. అతఁడు నివ్వెఱపడి "ఎవరు? దేవేంద్రవిజయుఁడా!" అని విప్పారిన కన్నులతోఁ జూచుచు ననియెను.

"అవును. నేనే!" అని దేవేంద్రవిజయుఁడు పలుకుచు శాంతముగా నిశ్శబ్దముగా గవాక్షముగుండ లోనికివచ్చెను. అతఁడు ఫణినాథునికి నమస్కరించి యిన్స్పెక్టరును పరామర్శించి రాయలవంక ప్రశ్నార్థపూర్వకముగాఁ జూచుచు నిలువఁబడియెను.

ఫణినాథుఁడు వెంటనే యందుకొని "మీకిరువురకుఁ బరిచయము చేయవలెను. వీరు దేవేంద్రవిజయ మహాశయుఁడు. పరిశోధకవర్గ నాయకుఁడు. వారు శ్రీ తుషారకాంతిరాయలు. రాజగిరి దుర్గాధిపతులు." అని పరస్పర మెఱింగించెను.

రాయలు దేవేంద్రవిజయునికి నమస్కరించుచు

"అయ్యా! నేఁడు మీ పరిచయము కలుగుట నా భాగ్యము. మీ రిక్కడకు వత్తురని నే నత్యంతాసక్తితో వేచియున్నాను. నేనే మీ సహాయము నర్థించుచు మీ కార్యాలయమువారితో మాటలాడితిని." అనియెను.

"నీవా నిచ్చెనమీఁద ఏమిచేయుచున్నావు?" యని దేవేంద్రవిజయునికి రాయలకుఁ బ్రత్యుత్తర మిచ్చుట కవకాశములేకుండ ఫణినాథుఁడు ప్రశ్నించెను.

"నేను వినుచున్నాను. నేనొక పరిశీలనలో నిమగ్నుఁడనై యున్నప్పుడు పరులమాటలు వినుచుండుట నాకుఁ బ్రీతి. నా ఆలోచనలకది సహాయకారి కాఁగలదు. అద్వితీయ ప్రతిభాసంపత్తితో మీరీ విచారణను జరిపినందులకు మిమ్ముల నభినందించుచున్నాను." అని దేవేంద్రవిజయుఁ డనియెను.

ఫణినాథుఁడు కించిత్స్మితమును సూచించెను. దేవేంద్రుని మాటలలో నాతనికి నమ్మకము కలుగకపోయెను.

మఱల దేవేంద్రవిజయుఁ డిట్లు పలికెను.

"ఒకటి రెండు చిన్న విషయములలో మన కిరువురకు నభిప్రాయ భేదములు దప్పఁ దక్కిన పరిశీలనమంతయును తమరు కడు నైపుణ్యముతో నిర్వహించినారు."

ఫణి:— ఏ జామాయి విషయమేమి? ఆ మొగదిని మఱల పరీక్షింప నవసరము లేదని నీ నిశ్చితాభిప్రాయమా?

దేవేంద్ర:- అవును. నే నిప్పుడే యామొగదిని జూచివచ్చుచున్నాను.

అప్పుడు గుమ్మము దెఱచికొని రామసేనుఁడు లోనికివచ్చెను. ఆతఁడు పరిశోధక కార్యాలయము నుండి వచ్చిన యిరువురు పరిశోధకులలో నొకఁడు. అతని చేతిలో నొక గుడ్డపేలిక యుండెను. ఆతఁడు దేవేంద్రవిజయునికి నమస్కరించి ఫణినాథునితో నిట్లు చెప్పెను.

"మహాశయా! శ్రీరంగ దోఁటలోని బావికంచున నేనీ గుడ్డపేలికను జూచితిని. ఇది రాజామాయి ధరించిన చీరకు సంబంధించినదని గృహసంరక్షకుని భార్య చెప్పుచున్నారు."

ఫణినాథుఁడు దానిని దీసికొని "నే నప్పుడే యనుకొన్నాను. ఏదో ప్రమాదము జరిగియుండునని నే నిదివరకే యనుకొంటిని. ఇఁక నాలస్యమెందులకు? బావిలోనికి మనుష్యులను దింపి యామె శవమును బైకిఁ దీయింపవలెను" అనుచు నాతఁడు గదివీడి పోనుద్యుక్తుఁడయ్యెను. దేవేంద్రవిజయుఁడు కొంత గంభీరముగా ఫణినాథుని వారించుచు నిట్లు పలికెను.

"రాజామాయికొఱకు బావిలో దేవులాడవలసిన పనిలేదు."

"ఈ గుడ్డపేలిక?" అని దానినెత్తి చూపుచు ఫణినాథుఁడు ప్రశ్నించెను.

"అవును. ఆ గుడ్డసంగతి మనవిచేయుదును. అని దేవేంద్రవిజయుఁడు రాయలవైపు తిరిగి "ప్రభూ! ఈ భవనములోఁ గుక్కలు కాని పిల్లులు కాని కలవా? మీరు యింటికి రాఁబోవు జామాతలగుటచే నన్ని సంగతులు తెలిసియుండవచ్చును." అని ప్రశ్నించెను.

ఫణి:— కుక్కలకును పిల్లులకును దీనిలో సంబంధమేమున్నది?

దేవేంద్ర:- క్షమింపుఁడు. ఇది చాల ముఖ్యవిషయము.

రాయలు:- ఒక పెంపుడుపిల్లి కలదు.

దేవేంద్ర:- ఆ పెంపుడుపిల్లియే యీ గుడ్డపేలికను తోఁట బావియొద్దన
బడవైచినది.

ఫణినాథుని ముఖము కందిపోయెను.

"ఇది పరిహాసమా?" యని గొణఁగుచు దేవేంద్రవిజయునివంకఁ దీక్ష్ణదృష్టులను బ్రసారించుచు

"మనమొక యమానుషమగు నేరమును- ఒక భయంకర హత్యను- గాజామాయి మరణమును-గుఱించి విచారణ సేయుచున్నపుడు-ఇదియేమి?- నీవు కుక్కలను పిల్లులను గుఱించి ప్రస్తావించెదవు?" యని యుగ్రుఁడై పల్కెను.

దేవేంద్ర:- గాజామాయి హత్య గావింపఁబడలేదు.

ఫణి:— ఆవిషయము మనకుఁ దెలియదు.

దేవేంద్ర:- నాకుఁ దెలియును.

ఫణి:— నీకా ?

దేవేంద్ర:- అవును. నాకే.

ఫణి:— ఆమె కనబడకపోవుటకుఁ గారణమేమి చెప్పెదవు?

దేవేంద్ర:- ఆమె కనబడకపోయిన పక్షమునగదా నేను కారణము చెప్పవలసి
నది ?

ఫణి:— ఆమె మాయమైనదని చెప్పుటలేదా?

దేవేంద్ర:- ఆమె మాయముకాలేదు.

ఫణినాథుఁడు కోపము నాపుకొనజాలక "నీకేమియును దెలియదు." అనియెను.

దేవేంద్రవిజయుఁడు శాంత చిత్తముతో "నా కన్ని విషయములును దెలియును." అనియెను.

ఫణి:— అటులైనచో నామె యెచ్చటనున్నదో నీకుఁ దెలియునా?

దేవేంద్ర:- నిశ్చయముగాఁ దెలియును.

ఫణి:— నీవామెను జూచితివా ?

దేవేంద్ర:- అవును. నే నామెను జూచితిని.

ఫణి:— నీవామెను జూచితివా? ఎప్పుడు?

దేవేంద్రవిజయుఁడు కొంచెమాఁ "ఇంచుమించు నాలుగైదు నిమిషములకిందట" అని బదులుపలికెను.

ఫణి:- ఇవన్నియుఁ జతురోక్తులు. నీవీప్రదేశమును వీడి యావలికిఁ బోవలేదు కాదా ?

దేవేంద్ర:- నిజమే నేను వెలుపలికిఁ బోలేదు.

ఫణి:- మఱి- నీవామెను జూచితివి ?

దేవేంద్ర:- అవును. చూచితిని.

ఫణి:- ఆ సంగతి ఎంతసేపటికిని జెప్పవేమి ? చెప్పుము. త్వరగాఁజెప్పుము.

దేవేంద్ర:- అయ్యో; నా నోటనుండి మాటరానిచ్చితివిగదా చెప్పుటకు-

ఫణి:- మంచిది చెప్పుము.

ఫణినాథుఁడొక కుర్చీలోఁ గూలఁబడెను. దేవేంద్రవిజయుఁడు శాంతముగా నిట్లుపలికెను. "రాజామాయి యీ గదిలోనే యున్నది."

ఫణి:- ఇక్కడనా ? ఆమె యిక్కడికెట్లువచ్చినది ?

దేవేంద్ర:- ఒక గోనెపట్టాపై.

ఫణినాథున కొడలు తెలియలేదు. అతఁడు లేచి నిలుచుండెను. పట్టరాని కోపముతో దేవేంద్రుని వంకఁజూచుచు "ఏమట్లా వైపునకు నిక్కినిక్కి చూచెద వెందులకు ? " అనియెను.

"అటుజూడుఁడు" అని దేవేంద్రవిజయుఁడు కొయ్యచట్రము తెఱకావలినైపున నున్న గుప్తప్రదేశమునుజేరి యడ్డముగానున్న వస్తువులన్నింటిని తొలగించెను. వలయాకారముగ నున్న వితర్దికపై వైచిన గోనెపట్టామీద నొక వృద్ధస్త్రీ పరుండఁబెట్టి యుండెను. ఆమెనోటిలో గుడ్డలుండెను. కాలు సేతులు గట్టివైచి యుండెను.

"ఆమె గాఢముగా నిద్రించుచున్నది." అని దేవేంద్రవిజయుఁడు క్రిందఁబడియున్న జేబురుమాలను దీసి వాసన జూచుచు

"ఇదిగో! ఈ జేబురుమాలతో నామెకుఁ గ్లోరోఫారము నిచ్చి మత్తును గల్పించినారు. ఇంకను వాసన గొట్టుచున్నది." అని పలికెను.

అందఱు నాతనివంకను నిరుకించుచున్న స్త్రీ వంకను ననిమేష దృష్టులను సారించుచు నబ్బుర పాటుతోఁ జూడసాగిరి. ముగ్గురు మనుష్యు

లామెను లేవనెత్తి యొక మంచముపైఁ బరుండఁబెట్టిరి.

ఫణినాథుఁడస్వస్థచిత్తుఁడయ్యెను. ముఖము బాగుగా నెఱ్ఱవాఱెను. అతఁడు ఇన్స్పెక్టరు వంకఁ దిరిగి "ఇన్స్పెక్టరుగారూ! మీరాప్రదేశమును బరిశీలింపలేదా?" అని ప్రశ్నించెను.

"లేదు." అని యిన్స్పెక్టరు తలవాల్చి జవాబుచెప్పెను.

"ఇది క్షమార్హము గాదు. బొత్తుగా క్షమార్హముగాదు ఇటువంటి తాబేదారులతోఁ బనులెట్లు సమకూఱఁగలవు?"

"ఇది పొరబాటు కావచ్చును." అని దేవేంద్రవిజయుఁడనియెను.

ఫణినాథుఁడు దేవేంద్రవిజయునివైపు తిరిగి "నేనామెను గనుగొనుట యసంభవమని నీవు తెలిసికొని యుందువు." అనియెను.

దేవేంద్ర:- మీరు నేలమీఁదఁ బ్రాఁకినట్లైన సంభవమయ్యెడిది.

ఫణి:- నేలమీఁదఁ బ్రాఁకుటయా?

దేవేంద్ర:- అవును. నేలమీఁదఁ బ్రాఁకుచు బరిశీలించి యుండినచో నరుగు మీఁదినుండి క్రిందికి వ్రేలాడుచున్న యామె పాదములను కొయ్యచట్రపు తెఱకల మధ్యగుండ మీరు చూచియుందురు.

ఫణి:- ఆ తెఱ మమ్ములను జాల మోసగించినది. అది కావలెనని పెట్టినట్లుగా మాకుఁ గనబడలేదు.

దేవేంద్ర:- దండధరుని విషయములో స్మరించవలసిన సూత్రములు కొన్ని యున్నవి. వానిలోఁ బ్రధాన సూత్రమేమనఁగా- వస్తువుల బాహ్యస్వరూపములను జూచి నమ్మఁగూడదు. అని-

ఫణి:- దండధరుఁడా?

అని నాలుక కఱచుకొని మిన్నకుండెను. అతఁడు రాజామాయి పండుకొనియున్న మంచమునుడాసి దగ్గరగా నిట్లుపలికెను.

"నా ఆలోచనలన్నియును దాఱుమాఱైనవి. ఇప్పుడు బైటపడిన విషయముల ననుసరించి నేను పునః ప్రారంభము సేయవలయును. సమాధానముల కొఱకు దేవులాడుకొనవలయును. ఈ క్షణములో నాకు దారి తెన్నులు గానవచ్చుటలేదు. మఱి- దేవేంద్రవిజయా! నీకు?"

దేవేంద్ర:- నాకొకటి రెండాలోచనలున్నవి.

ఫణి:- నీ విందులోఁ దబ్బిబ్బులుపడలేదా?

దేవేంద్రి:- లేదు. నేను మీ ధోరణిలో లేను.

ఫణి:- అవును. నీవు నాధోరణిలో లేవు. నీది ఎల్లప్పుడు నొక టే ధోరణి. దండ ధరుని ధోరణి.

అని ఫణినాథుఁడు వికటముగా నవ్వెను. రాయలు వారిరువురివంక నచ్చెరువుతోఁ జూచుచు "ఇది యంతయు నాకెంతయో విచిత్రముగాఁ గానబడుచున్నది." అనియెను.

ఫణి:- ఇట్టి యవాంతరములను మేము సామాన్యముగా లక్ష్యము సేయము. ఇవి మమ్ములను నిరుత్సాహపఱుపఁజాలవు. ఒకింతతడ వాలోచించి మఱల మొదలెత్తుకొందుము.

దేవేంద్రవిజయుఁడు గవాక్షముగుండఁ దోఁటవైపుజూచెను. ప్రహరీగోడ కావలనిర్మాణములోనున్న భవనముమీదికి పరంజాలకు వైచిన నిచ్చెన నెక్కుచు నొక కూలివాఁడు ఇటుకరాళ్లను గొంపోవుచుండెను. ఎందులకో ఆకూలివాఁడు చేయుచున్న పని దేవేంద్రున కుల్లాసము గలిగించెను. అతని ముఖముపైఁ జిఱుతహాసము చిందులాడెను.

ఇన్స్పెక్టరు తాను గావించిన పొరబాటును దలంచుకొనుచు విచారగ్రస్తుఁడై నిలువబడెను.

ఫణి:- ఆమె నిద్రలేచినతరువాతగాని యామెవలన మనకుఁ గొన్ని సంగతులు తెలియవు. ఆమెను నేను కడు మెలఁకువతో సమగ్రముగాఁ బ్రశ్నించెదను. ఈ లోపుగా నామెను స్వంతగదిలోనికిఁ జేర్చి మస్తుదిగిపోవు పఱకు పరుండనిండు.

దేవేంద్రి:- ఆమె స్వంతగదిలోనికా ? కాదను కొందును.

ఫణి:- ఆమె స్వంతగదిలోనికిఁ గాదు.

దేవేంద్రి:- ఆమె యెక్కడ పరుండియున్నను ద్వారము చెంత నొక రక్షకశాఖోద్యోగి కాపుండవలయును.

ఫణి:- ముఖ్యముగా నుండవలెను. చాల యవసరము. ఇన్స్పెక్టరుగారూ ! ఈ సంగతి చూడుఁడు. ఆమెను తీసికొని పోవచ్చును.

ఇన్స్పెక్టరు రక్షకభటుల నిరువురను బిలచెను. వారి సాయమున నాతఁడును రామసేనుడుఁను గలసి రాజామాయిని జేతులపై వెలుపలికిఁ దీసికొని పోయిరి.

ఫణినాథుఁడు చేతులు కట్టుకొని ముఖము వంచికొని "నేను సర్వమును పునర్విచారణము చేయవలయును." అని దీర్ఘాలోచనములో మునిఁగిపోయెను.

దేవేంద్రవిజయుఁడును శ్రీతుషార కాంతిరాయలును నిశ్శబ్దముగా నాతని బరికించుచుండిరి.

## ౧౧

# కోటీశ్వరుని రాక

రాజామాయిని మోసికొనిపోవుటలో ద్వారము తలుపులు తెఱచియుండెను. ఒకింతతడవు ఫణినాథునివైపు చూచి దేవేంద్రవిజయుఁడు వెలుపలికిఁ బోయెను. రాయలు జేబులు తడవుకొని 'నాసిగరెటుకేసు' అని బిగ్గఱగా ననుకొనుచు నాతని వెంబడించెను.

మెట్లమీఁదనే రాయలు దేవేంద్రవిజయుని గలసికొని యిట్లనియెను.

"మహాశయా! మీరనుమతింతురేని నేను మీవెంట వచ్చెదను. మీపరిశోధనలు నాకెంతయో యుత్సాహజనకములుగా నున్నవి."

దేవేంద్ర:- తప్పక రావచ్చును. అదియునుగాక మీనుండి తెలిసికొనవలసిన విశేషము లనేకములున్నవి. పణినాథసేనునితోఁ గలసి విషయము లన్నియుఁ జర్చించుట లాభదాయకమే యగును గాని—"

అని యాతఁడు సందేహించుచుఁ దటాలున నాఁగిపోయెను.

రాయలు:- ఆయన విషయములన్నియుఁ బునరావృత్తము జేయుచు వ్యవహారమంతటినీ పునర్నిర్మాణము చేయుచున్నాఁడు ఇప్పట్లు ఆయన సమాధికి భంగము కలిగించుట భావ్యముగాదు.

ఆమాటలు పలుకుచు రాయలు నర్మగర్భముగాఁ జిఱునవ్వు నవ్వెను. దేవేంద్రవిజయుఁడు శాంతముగా నాతనివంకఁ జూచుచు "కావచ్చును" అనియెను.

వారు భవనములోనుండిఁ బోయి చివరిద్వారమును దాఁటి తోఁటలోనికిఁ బోయిరి. ఇరువది గజముల దూరము పోయినపిదప దేవేంద్రవిజయుఁడాగి రాయలను విపులముగాఁ బ్రశ్నింపసాగెను. ఆతఁడు కుటీవరులను గుఱిం

చియు, వారి వేషభాషలు పరివర్తనలను గురించియు. ముఖ్యముగా వారిలోనొకఁడు మోతీయనువాఁడు పచ్చలపతకమును హరించుటకు జేసిన ప్రయత్నమును, మోటారుకారుల దొంగిలినమును గురించియు ననేక వివరములు దెలిసికొనియెను.

రాయలు:- అవృద్ధసుజీవరుఁడే దండధరుఁడు కానోపునని నాయనుమానము.

దేవేంద్ర:- కానోపును. మాఱువేషములు ధరించుటలో దండధరుని మించినవారులేరు. నాసహచరుఁడు హరకృష్ణుఁడు మూఁడుపర్యాయములు దండధరుని గలసికొనియెను. ఒక పర్యాయమేనియు నాతని నిజస్వరూపమును గుఱుతింపఁజాలక పోయెను. ప్రతి సమావేశమప్పుడు నాతఁడొక యన్యపురుషునిపలెనే కనబడుచుండెను. హరకృష్ణున కాతఁడొక పూర్వపరిచితునివలెనే తోఁచుచుండెను గాని దండధరుఁడని నిశ్చయముగా నిర్ణయింప నలవిగాకుండెను. ఇంకను నాతఁడు తెలిసికొనజాలని సన్నివేశము లనేకము లుండియుండవచ్చును. దండధరుని ఛాయాచిత్రము లనేకము లున్నవి. కాని ఒకదానితో నింకొకదానికేమాత్రమును పోలికలు లేవు. దండధరుఁడు మేధాసంపన్నుఁడగు నటుఁడు. కావుననే యాతఁడు విచిత్రవేషధారణలో నద్వితీయుఁడై విజయమునొందుచున్నాడు. ఏపాత్రనభినయింపవలయునో యాపాత్ర కాతఁడు తూచినట్లు సరిపోవగలఁడు. తగిన వేషభాషలతోఁ బ్రవర్తింపఁ గలఁడు.

రాయలు:- అతఁడు కేవల దివ్యస్వరూపుఁడై యుండవలయును. కాని — మీబోఁటివారలతోఁ దఱచుగా సంభవించెడు సన్నికర్షలమూలమున నాతనికెన్నఁడేని యపాయము వాటిల్లకమానదు.

దేవేంద్రవిజయుఁడు రాయలను ప్రశ్నింపసాగెను. క్షితీంద్రనాథుని గృహపరివారమును గుఱించి సకలవిషయములను దెలిసికొనియెను. ఆమాటల సందర్భములో దేవేంద్రవిజయుఁడు రాయలతోఁ గొన్ని సంగతులుచెప్పెను. దండధరునకున్న పరివారము మఱియే యితర చోరనాయకునకును లేరు. కాఁబట్టి తన జట్టులోనివారిని గొందఱిని క్షితీంద్ర నాథునింటిలోఁ బ్రవేశపెట్టి యుండవచ్చును. అదియునుగాక యిట్టి పెద్ద వ్యవహారములలో నాతఁడు సైతమొకటి రెండుపాత్రలను ధరించి ప్రదర్శించుచుండవచ్చును.

రాయలు:- అతఁడే వృద్ధసుజీవరుఁడైన యెడల క్షితీంద్రనాథుని గృహపరి

వారములోనివాఁ డెట్లగును ?

దేవేంద్రి:- దండధరుఁడే వృద్ధసుజీవరుఁడని నేను నిశ్చయముగాఁజెప్పుట లేదు. కాఁడనియే యనుకొనవలసి యున్నది. ఏలయన- ఆమోటారుకారుల దొంగతనము వారి జట్టులో నొకసామాన్యుఁడు చేయఁదగినపని. అటువంటి స్వల్పవిషయములను గుఱించి దండధరుఁడు తలంప నే తలంపఁడు.

క్షితీంద్రనాథుని సేవకులను గుఱించి తనకు జ్ఞాపకమున్నంతవఱకు సకల వివరములను రాయలు దేవేంద్రవిజయునికిఁ జెప్పెను. పరిశోధకుని ప్రతిభా పూర్వకములగు ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరము లొసఁగుచున్నప్పుడు తానింతకుమున్ను నిశితముగాఁ బరిశీలింపని చిల్లర విషయము లెన్నెన్ని తనకు జ్ఞాపకమునకు వచ్చినవో యవియన్నియుఁ దలచుకొనుచు రాయలు విభ్రాంతుఁడయ్యెను. దేవేంద్రవిజయుని ప్రశ్నావళి పూర్తిఅయినపిదప రాయ లాతనితో నిట్లనియెను.

రాయలు:- దండధరుని బట్టుకొనుట సామాన్యమగు కార్యముకాదని మీరు చెప్పినదానినిబట్టి సుబోధకమగుచున్నది. మీలో నెవ్వరు నింతవఱకు నాతని బంధింపలేకపోయియుందు రనుకొందును.

దేవేంద్రి:- కాదు. కాదు. హరకృష్ణుఁ డాతని రెండు పర్యాయములు పట్టుకొనియెను. అందులో నొకపర్యాయమాతని చెఱసాలలో బంధించి విచారణకుఁ దీసికొనివచ్చెను. ఈ లోపుగా దండధరుఁడు వేఱొక మనుష్యుఁడైపోయినాఁడు. న్యాయస్థానమునుండియే యాతని వదలివైచినారు.

రాయలు:- నిజముగానా ! ఇది చాల విచిత్రముగాఁ గనఁబడుచున్నది.

దేవేంద్రి:- తరువాత- ఇంద్రనీలమణి వ్యవహారములో హరకృష్ణుఁడు మఱల దండధరుని బట్టుకొనియెను. అద్వితీయ ప్రతిభాశాలురగు చోరులందఱికి వలెనే దండధరునికి సైత మొక దుర్వ్యసనము గలదు. అయ్యది కామినీ గమనము. అతఁడొక స్త్రీమూర్తిని బ్రేమించి యామెయింటికిఁ దఱచుగా వచ్చుచుండెను. ఆయవకాశమును బురస్కరించుకొని వారు దండధరుని బంధింపఁగలిగిరి.

రాయలు:- అదియొక పౌరుషకార్యము గాఁజాలదు.

దేవేంద్రవిజయున కాశ్చర్యము గలిగెను.

దేవేంద్ర:- పౌరుషమో అపౌరుషమో యెవనికిఁ గావలయును ? అట్టి అవ కాశమును దండధరునివంటి వానిపట్ల జారవిడువవచ్చునా ?

రాయలు:- నిజమే కావచ్చును. కాని—

దేవేంద్రవిజయుని ముఖములోని యాశ్చర్యభావ మంతరించిపోయెను. అతఁడు మరలచెప్పసాగెను.

దేవేంద్ర:- హరికృష్ణుడు దండధరుని బంధించి యింద్రనీలమణిని గ్రహించెను. పదిని మేషములలో దండధరుఁడు మణితోఁగూడ మాయమయ్యెను.

రాయలు:- ఆతని మనోహారిణి యేమయ్యెను ?

దేవేంద్ర:- నాకుఁదెలియదు. ఆమె మరణించె నని వింటిని. కాని యామె నిజముగా మరణించెనని యిప్పటికి దృఢముగాఁ దెలిసికొంటిని.

రాయలు:- దండధరునివంటి వానిని ప్రేమించిన స్త్రీ ఏమి సుఖపడఁగలదు ? ఎల్లపుడు నాతని క్షేమమునుగురించిన యాందోళనయే యామె నాహ రింపఁగలదు.

దేవేంద్ర:- మీరు పొరబడుచున్నారు. దండధరునివంటి ధీరోదార హృద యుఁడగు చోరుని వరించు స్త్రీ లెందఱోయున్నారు. ఎందఱో ధని కురాండ్రు- సౌందర్యనిధులు- దండధరునితోఁ బరిచయము గలిగించు టకు వేలకువేలు నాకర్పించుటకు సిద్ధపడిరి.

రాయలు:- ఇది నమ్మఁదగునా ? కాని- మనసు వచ్చిన పురుషుల విషయములో స్త్రీ లెంతకైనను సాహసింపఁగలరు. మీరు వారుకోరిన ప్రకారము చేసినారా ?

దేవేంద్ర:- ఎట్లుచేయఁగలను ? కామినీ బాహుపంజరస్థుఁడైన దండధరుని నేనే పట్టుకొనగలిగి యుండినచో—

రాయలు:- ఎప్పటికేని యాతఁడు మీబారినుండి తప్పించుకొన జాలఁడు.

దేవేంద్ర:- ఏమో ! ఎవరు చెప్పఁగలరు ? భగవదనుగ్రహమువలన నట్లే యగుఁగాక !

దేవేంద్రుఁడు గడ్డిమొలచిన తావుమీఁదుగా నిచ్చెన యున్నచోటికి వచ్చి దానిచుట్టునున్న పాదచిహ్నములను బరిశీలింపసాగెను. వానివంక నిదానముగాఁ జూచి తోఁటమార్గము ననుసరించి ద్వారముదాఁటి నిర్మాణములో నున్న భవనప్రదేశమును జేరుకొనియెను. అతఁడు దాని నెక్కువకాలము

పరీక్ష చేయక సరాసరి యాభవన సింహద్వారము వైపునున్న రాజవీధి నెక్కి ముందు వెనుకలకు నాల్గుపర్యాయములు తిరిగి మఱల వెనుకకువచ్చెను.

"నేను చూడఁదలఁచుకొనిన దంతయుఁ జూచినాను. మనమింక భవనములోనికిఁ బోవచ్చును." అని యాతఁడు రాయలతో ననియెను.

రాయలు:- మీరేవిషయములను జూచుటకు సిద్ధపడియుంటిరో వాని నన్నింటిని జూచియుందు రనుకొందును—

దేవేంద్ర:- నేను సిద్ధపడి యెదురుచూచుచున్న విషయములనే—

రాయలు:- అట్లే అయియుండవలయును.

వారు భవనము లోనికిఁబోయిరి. ఫణినాథుఁ డింకను దీర్ఘాలోచనా తత్పరుఁడైయుండెను. వీరిని జూడఁగనే యాతఁడులేచి యిట్లుపలికెను.

"ఇప్పుడు మనము చేయవలసిన పని యొకటియున్నది. అది ఏమనఁగా-చోరులిక్కడి వస్తుసంచయములను గొనిపోవుచుండఁగాఁ జూచినవా రెవరైన నుండిరేమో యీ చుట్టుపట్ల జనులను విచారించి తెలిసికొనవలయును. బరువుగల వస్తువులను దీసికొని పోవలసియుండుటచే వారొక శకటమును గొనివచ్చియుందురు. దాని నెవరేని చూచి యుండవచ్చును. సగము గట్టిన యింటిముందర సామానులతో నిలువబడియున్న బండిని వారు కొంత ఆశ్చర్యముతోఁ జూచి యుందురు. ఉపస్నమయమైనప్పటికిని చోరులు దానిలోనికి వస్తువులను జేర్చుచు భర్తిచేయుటనైతము కొందఱి కంటఁబడి యుండవచ్చును. రామ నేనుడుపోయి యావీధిలో నున్నవారి నెల్లరను విచారించి రావలయును. ఆవీధి పేరేమి ?"

దేవేంద్ర:- అది సుల్తానువీధి! పరిశోధకుడగు దివాకరుఁ డావీధిలోఁ జోరుల శకటమును జూచినవారికొఱకు గంటనుండి విచారణలు చేయుచున్నాఁడు.

ఫణి:- మంచిది. మనము పురోగమించుచున్నట్లే. దేవేంద్రవిజయుఁడును రాయలును ఆసనములపైఁ గూరుచుండిరి.

ఫణినాథుఁడు గవాక్షమువంకఁ దనచేతిని జూపుచు "మీకు విస్తారముగా జాడలుదొరికిన వనుకొందును." అని దేవేంద్రవిజయుని జూచుచుఁ బలికెను.

దేవేంద్ర:- అవును. నేను అనేకములగు జాడలను గనిపెట్టితిని.

ఫణి:- దండధరుని జాడలా ?

దేవేంద్రి:- కావు. దండధరుని జాడలు కావు.

ఫణినాథుని ముఖము ప్రఫుల్లమయ్యెను.

"నేను నీకుఁ జెప్పలేదా ? నీయభిప్రాయమును మార్చుకొనినందులకుఁ జాల సంతోషము."

దేవేంద్రి:- నాయభిప్రాయమును మార్చుకొనలేదు.

ఇంతలో సింహద్వారమునొద్ద పిలుపులు వినఁబడెను. మెట్లమీఁద బిగ్గఱగాఁ గంఠధ్వనులు చెలరేఁగెను. ద్వారము తెఱచికొని క్షితీంద్రనాథుఁడు లోనికి వచ్చెను. అతఁడా మందిర శూన్య కుడ్య భాగములవంక నొకపర్యాయము కలయఁ జూచి పెద్దపెట్టున వాపోయెను.

"అయ్యో ! నాకళాఖండములు. నాఅపురూప నిక్షేపములు——నాకొంపఁ గూల్చినారు మానుసాధములు——"

అతనికి దుఃఖావేశమున మాటలు రాకపోయెను. కుంటువడిన నడకతో నాఁతఁడొక సోఫాను జేరుకొని యందులోఁ గూలఁబడి వెలవెల బోవుచున్న గోడలవంకఁజూచుచు బిగ్గఱగా నేడ్వసాగెను. జయంతశ్రీ సుమబాలా సహితయై లోనికి వచ్చెను. ఆమె నెదుర్కొనుటకై రాయలు లేచిపోయి వారిని దీసికొని వచ్చెను. జయంతశ్రీ తండ్రిని సమీపించి యసహనభావముతో

"నాన్నగారూ ! మీరేదుపుమానుఁడు. మీకంఠస్వరము కర్ణకఠోరముగా నున్నది. నేను వినజాలకున్నాను." అనిపలికి వెంటనే కోపముతో రాయలవైపు తిరిగి రోసరోసలాడుచు.

"మీపరిహాసములు ప్రాణాంతకములుగాఁ బరిణమించుచున్నవి. దేనికైనను వేళావేళ లున్నవి. చీఁకటిరాత్రి జడివాన కురియుచుండఁగా మూఁడు మైళ్లు రైలుస్టేషనుకు బండిలేనివేళ యున్నదని చెప్పి మమ్ములను బంపుట యేమనుకొనవలయును ?"

రాయలు:- నీవేమి మాటలాడుచున్నావో నాకర్థమగుటలేదు. రాత్రి తొమ్మిది గంటల బండి లేదా ?

జయంతశ్రీ:- లేదు. మీరు చూచి చెప్పిన 'రైల్వేగైడు' కొన్ని సంవత్సరముల నాటిది. ఇంత తెలివితక్కువతనముతోఁ గూడిన పరిహాసము నేనెన్నడును కని విని మూడలేదు.

రాయలు:- అదినాకుఁ బరిహాసముగాఁ గనఁబడుటలేదు. నీవేల యట్లారోపణ

చేసెదవు? నేనట్టి చిలిపి చేష్టలు చేయువాఁడనుకాను. ఆ 'రైల్వేగైడు మీఁది తేదీని జూచుటకు నాకుఁ దోఁచలేదు. అద్రాయరులో నాసిగరెట్ల డబ్బీని పెట్టుకొనుచుంటిని. దినము ఆగైడు నాకంటఁ బడుచుండెను. కాని దాని మీఁదనున్న తేదీని గమనింపకపోవుట నాలోపమని యొప్పుకొందును

సుమబాల:- అదిపొరబాటని నేనుచెప్పితిని. తమరంతటి నిర్దయగాఁ బ్రవర్తింపఁజాలరని విన్నవించితిని.

జయంతశ్రీ:- ఇంతకు మీరు దానిమీఁదనున్న తేదీని జూడకపోవుట చాలా విచారకరము.

క్షితీంద్రనాథుఁడు లేచి నిలువఁబడి బిగ్గఱగా నేడువసాగెను.

"అయ్యయ్యో! నానిక్షేపములు! నాకళాసంపద! ఎంతటి యపూర్వములగు చిత్రములు! ప్రపంచఖ్యాతి నార్జించిన వానిని బోఁగొట్టుకొంటిని. అటువంటివి మఱల దొరకవు. లక్షలు వ్యయముచేసి సంపాదించితిని. అయ్యో! అయ్యో!

ఫణినాథుఁడు అధికార దర్పముతో ముందునకువచ్చి "క్షితీంద్రనాథ మహాశయా! మీకుఁ దీఱరాని నష్టము వాటిల్లినది. నాకుఁ జాల విచారము గలుగుచున్నది. నేను ఫణినాథుఁడను రక్షకశాఖాధ్యక్షుఁడను." అనియెను.

"అయ్యో! ఇది నాశనము. నాకళాకేంద్రము వినాశమై పోయినది." అని క్షితీంద్రనాథుఁడు రోదనము చేయుచుఁబలికెను.

ఫణి:- మహాశయా! మీరు కడుపుచెరువగునట్లు దుఃఖించుచున్నారు. మీ వస్తుసంపదను తిరిగిసంపాదించి యిచ్చెదము. కొంతకాల మోపిక పట్టుఁడు.

క్షితీంద్రనాథుఁడు కొంచెము తెప్పిఱిల్లికొనియెను. ఫణినాథుఁడు మఱల నిట్లనియెను.

"ఇంతకును— మీకళా ఖండములలోఁ బ్రముఖమైనదానిని చోరులు సంగ్రహింపలేదని యూఱడిల్ల వచ్చును. అశోకుని కిరీటమును వారు దొంగిలింపలేదు."

రాయలు:- లేదు. వారీ యినుపపెట్టును ముట్టుకొనలేదు. దానినెవ్వరును దెఱువలేదు.

క్షితీంద్ర:- దానికి నీయినుపపెట్టెకు నేమి సంబంధము? ఈయినుపపెట్టె ఖాళీది.

రాయలు:- ఖాళీ యినుపపెట్టెయా! మఱి-మీకిరీటము ?

క్షితీంద్ర:- అయ్యో! దేవుఁడా! దానిని గూడ దొంగిలించినారా ?

అని నిరాశతో మఱియొకమాఱాతఁడు బిగ్గఱగా నేడ్చెను.

రాయలు:- వారు దానిని దొంగిలించియుండరు. ఈ యినుపపెట్టె నెవ్వరు ముట్టుకొనలేదు.

క్షితీంద్ర:- ఆకిరీటమీయినుప పెట్టెలోనే నాఁడును లేదు. అది అక్కడ— వారు నాశయన మందిరమును జొచ్చినారా ?

ఫణి:— లేదు.

రాయలు:- ఈరెండు మందిరములు దప్పఁ దక్కిన వాని జోలికిఁ బోయినట్లు లేదు.

క్షితీంద్ర:- అట్లయినచో నామనస్సు కొంత శాంతపడఁగలదు. నాశయనాగారము లోని యినుపపెట్టెకు రెండే బీగములుగలవు. వానిలో నిది యొకటి." అని యాతఁడొక బీగమును దనకోటు జేబులోనుండి తీసి పైటికిఁజూపించుచు "దాని రెండవ బీగమీ యినుపపెట్టెలో నున్నది." అనియెను.

ఫణినాథుని ముఖము మఱలనొకసారి వికసించెను. అతఁడు స్వహస్తములతో కిరీటమునుద్ధరించి క్షితీంద్రునికి సమర్పించుటకుఁ బూనుకొనియెను. అతఁడు విజయసూచకముగా నట్టహాసము చేసెను.

క్షితీంద్రుఁడు మఱలరోదనము చేయసాగెను.

"చూడుఁడు. వారు నన్ను దోచుకొని పాడుచేసినారు. అయ్యో ! నాచిత్రములు! అనన్యదుర్లభములు! నిలువెత్తు ధనము పోసి సంపాదించిన నిక్షేపములు! నేను వానిని మఱల చూడఁగలుగుదునా ?"

# ౧౨

# పచ్చలపతకము

అందఱును కోటీశ్వరుని చుట్టుమూఁగి యాతని దుఃఖమును సానుభూతితోఁ దిలకించుచుండిరి. ఆ ఘోరదుఃఖావేశమును జూడనొల్లక కాబోలును కుసుమబాల మందిరము వీడి వెడలిపోయెను.

క్షితీంద్రుఁడు తన యమూల్యవస్తువులను దలంచుకొనుచుఁ బెద్దపెట్టున నేడ్చుచు నాచోరులను గొంతెత్తి బిగ్గఱగా దిట్టసాగెను. ఆకస్మికముగా నాతని కొకయాలోచన స్ఫురించెను. ప్రక్కనున్న కుర్చీపై నొక చఱపు చఱచి యిట్లఱచెను.

"ఆ ఎనిమిదివేలరూపాయలు! ఆ వృద్ధసుజీవరుఁడు మోటారుకారును కొనజాలఁడు. వాఁడు నిజాయితీ గలజేరగాఁడు కాఁడు."

రాయలకు నగవంకురించెను. నయనములు విప్పారెను. ఆతఁడు చటుక్కున లేచి ప్రక్కగదిలోనికిఁ బోయి సావధానముగా నవ్వుకొనియెను. ఫణినాథుఁడు క్షితీంద్రుని సమీపించి యిట్లనియెను.

ఫణి:— మహాశయా! మీరు శాంతిచిత్తులై యుండుఁడు. మేము మీవస్తువులను వెదకి తీసికొనివచ్చెదము. శాంతింపుఁడు.

ఫణినాథుని సమాశ్వాసవచనము లెట్టకేలకు క్షితీంద్రుని శాంతింపఁజేసెను. ఆతఁడు తేఱుకొని "దేవేంద్రవిజయుఁ డేఁడీ?" యని యడిగెను. ఫణినాథుఁడు దేవేంద్రుని పరిచయము చేసెను.

క్షితీంద్ర:- అయ్యా! చోరుల ఆచూకీ ఏమైన గనిపెట్టగలిగినారా?

ఫణినాథుఁడు అధికారసూచకస్వరముతో "యథాప్రకారము మనమిప్పుడు విచారణ ప్రారంభింపవచ్చును" అనియెను. తనసమక్షమున క్షితీంద్రుఁడు పరిశోధకునకుఁ బ్రాధాన్యమిచ్చుట యాతఁడు సహింపఁజాలకపోయెను. ఆతఁడు వ్రాతబల్లకడకుఁ బోయి జేబులోనుండి కొన్ని కాగితములు తీసి ముందుంచుకొని తన ప్రశ్నలకు జవాబులను వ్రాసికొనుటకుద్యుక్తుఁడయ్యెను. రాయలు తిరిగి వచ్చెను. ఇన్స్పెక్టరును బిలచికొనివచ్చుటకు రక్షకభటుఁడు పోయెను. క్షితీంద్రుఁడు రెండుచేతులతోఁ దలకాయ

పట్టుకొని సోఫాలోకూరుచుండి ఫణినాథునివంక దీనదృష్టులతోఁ జూచు చుండెను. తండ్రిరోదన మెప్పుడు మాననోయని వ్యగ్రభావముతో నిర్వి ణ్ణుడై ద్వారముచెంత సోఫాపైఁ గూరుచుండియున్న జయంతిశ్రీ లేచి వాకిటబల్లకడనున్న కుర్చీ నాక్రమించెను. దేవేంద్రవిజయుఁడు వ్యథితమన స్కుఁడై నిశ్శబ్దముగా నటునిటు నడయాడుచుండెను. ఎట్టకేల కాతఁడాఁగి ఫణినాథుని వెనుకప్రక్క గోడకానుకొని నిలువఁబడియెను.

ఫణినాథుఁడు రాయలనుబ్రశ్నించి తెలిసికొనిన విషయములన్నియును వ్రాసికొనియెను. సుజీవరుల రాకగురించియు, మోటారుకారుల దొంగతనము గురించియు, పతకమును దొంగిలించుటకుఁ జేసిన ప్రయత్నములను గురిం చియు క్షితీంద్రనాథుని, జయంతిశ్రీని ప్రశ్నించెను. క్రొత్తవిషయము లెవ్వి యును దెలియరాలేదు. అతఁడు కొంచెమాఁగి మామూలు కర్మకాండవలె నిర్లక్ష్య ధోరణిలో క్షితీంద్రనాథునితో నిట్లనియెను.

ఫణి:- మహాశయా! ఇంతకుఁ బూర్వము మీయింటనేదైన దొంగతనము జరి గినదేమో తెలిసికొన గోరుచున్నాను.

క్షితీంద్ర:- మూఁడేండ్లకుఁ బూర్వమీ దుర్మార్గుఁడు దండధరుఁడు——

ఫణి:- అవును. అవును. ఆదొంగతనమును గురించి నాకంతయును దెలియును- కాని- మఱల మీవస్తువులు కొన్ని దొంగిలింపబడినవి కావా!

క్షితీంద్ర:- లేదు. నావస్తువులు పోలేదుకాని మాఅమ్మాయి వస్తువులు కొన్ని పోయినవి.

ఫణి:- మీ అమ్మాయివా?

జయంతిశ్రీ:- అవును. ఈమూఁడేండ్లలోపుగ నావస్తువులు రెండు మూఁడు పర్యాయములు దొంగిలింపఁ బడినవి.

ఫణి:- అయ్యో! అలాగునా! ఈవిషయములన్నియు మాకిదివఱకే తెలియఁ జేయవలసి యుండెను. ఇదియంతయుఁజాల చిత్రముగాఁ గన్పట్టు చున్నది. మీరు రాజామాయి ననుమానించు చున్నారా?

జయంతిశ్రీ:- లేదు. నేనామె నెప్పటికి ననుమానింపను. ఆమె యెన్నటికిని గాజాలదు. ఆమె అలహాబాదులో నీయింటిని గాపాడుచుండగా దొంగతనములు రాజగిరి దుర్గములో జరిగినవి.

ఫణినాథుడు మాటలాడలేకపోయెను. అతఁడు వ్రాసినదానిని వెనుకకు

ముందునకుఁ బుటలు త్రిప్పుచుఁ బరిశీలింపసాగెను. తరువాత నాతఁడు నెమ్మదిగా "మంచిది. ఇది నానిర్ణయమున కనుగుణ్యముగానే యున్నది." అనియెను.

క్షితీంద్రి:- ఏనిర్ణయము?

ఫణి:- ఇపుడుకాదు ఇపుడుకాదు.

అతఁడు జయంతశ్రీ వైపుతిరిగి యిట్లుప్రశ్నించెను.

మూఁడేండ్ల నుండియు నీదొంగతనములు ప్రారంభ మైనవనిగదా నీవుచెప్పినది?"

జయంతశ్రీ:- అవును. మూఁడేండ్లకుఁ బూర్వము ఆగష్టునెలలోఁ బ్రారంభ మైనవని నాకు జ్ఞాపకము.

ఫణి:- మంచిది. మూఁడేండ్లకుఁ బూర్వము ఆగష్టునెలలోనే మీతండ్రిగారికి రాత్రి వచ్చినటువంటి బెదరింపులతోఁ గూడిన యుత్తరము వచ్చిన పిదపనేకాదా దొంగతనము జరిగినది?

క్షితీంద్రి:- అవును. ఆదౌర్భాగ్యులు—

ఫణి:- మూఁడేండ్ల క్రితము మీయింటిలోఁ జేరిన నౌకరులెవ్వరో తెలియఁ జేసెదరా?

జయంతశ్రీ:- రాజామాయి మాయింటిలోనికి వచ్చి సంవత్సరము మాత్రమే అయినది.

ఫణి:- ఒక సంవత్సరము మాత్రమేనా?

అతని ముఖములో విసుగుదల గోచరించెను. కొంచెముసేపు తాళి "కడచిన పర్యాయము దొంగతనములోఁ బోయిన వస్తువులెవ్వి?" యని ప్రశ్నించెను.

జయంతశ్రీ:- అది ముత్యముల తురాయి. నిన్న శ్రీ తుపాగా కాంతిరాయలొసఁగిన పచ్చల పతకము వంటిది.

ఫణి:- దయవహించి నా కా ప త క ము ను జూపెదరా? చూడవలెనని కోరికగా నున్నది.

జయంతశ్రీ "చూచుటకేమి?" అనియామె రాయలవైపు తిరిగి "అది మీతావు ననే యున్నదిగదా! తీసిచూపింపుడు." అనియెను.

రాయలు:- నాతావుననా? లేదు. నాకడనెట్లుండఁగలదు? అది నీదగ్గఱలేదా? అని ఆశ్చర్య విష్టుడై పలికెను.

జయంతశ్రీ:- నాదగ్గఱ దాని పెట్టెమాత్రమే యున్నది. దానిలోఁబతకములేదు,

రాయలు:- పతకములేదా? అతనికాశ్చర్య మధికమయ్యెను.

జయంతశ్రీ:- అవును. మేము రాత్రి నిర్ధారముగ రైలుస్టేషనువఱకు ప్రయాణము చేసివచ్చితిమి. పచ్చలపతకమును దీసికొన కుండఁగనే ప్రయాణమైతినని నాకప్పుడు జ్ఞప్తికివచ్చినది. వెంటనేపోయి అలమారతలుపు తెఱచిచూచితిని. పచ్చలపతకము పెట్టినపెట్టె శూన్యముగా నుండెను.

ఫణి:- ఒక్క క్షణము - అనిరాయలవంకకుఁ దిరిగి "ప్రభూ! మీరు మోతీయాను వానివి పచ్చల పతకము పెట్టెను దీసికొని పోవుచుండఁగా బట్టుకొనలేదా?"

రాయలు:- అవును. అది వానిజేబులో నుండగాఁ వానినిబట్టుకొంటిని.

ఫణి:- వాఁడాపతకమును జేబులోనికిఁ జేర్చికొని 'ఖాళీ' పెట్టెను వాఁడక్కడ పడవైచి యుండును.

రాయలు:- లేదు. అటులెన్నటికిని జరుగలేదు. వీఁడేకాక బీగములకొఱకు అలమార తాళమును బ్రద్దలుకొట్టినవాఁడును దొంగిలింపలేదు. ఏలయనఁగా ఆదొంగలు పాఱిపోయిన తరువాత చాలసేపటికి పతకమున్న పెట్టెకు ప్రక్కనేయున్న నాసిగరెట్టుకేసులోనుండి యొకసిగరెటును దీసి వెలిగించితిని. నాకప్పుడిట్టి యనుమానమే కలిగి ఆపెట్టెను తెఱచి చూచితిని. పతకమప్పుడందులోనే యుండెను.

క్షితీంద్ర:- అది దొంగిలింపఁబడినది.

రాయలు:- లేదు. లేదు. అది దొంగిలింపఁబడియుండదు. ఊర్మిళగాని, సుమబాలగాని ఇక్కడికిఁ దెచ్చియుందురు.

జయంతశ్రీ:- నిశ్చయముగాఁ జెప్పఁగలను. సుమబాల దాని నిక్కడకుఁదీసికొని రాలేదు. మీరు దానిని దీసి జేబులోవైచికొని భద్రము చేసినారని ఆమెయే నాతోఁజెప్పినది.

రాయలు:- అట్లయిన ఊర్మిళ కావచ్చును.

ఫణి:- ఆమెను బిలిపించి కనుగొనవచ్చును. ఇన్స్పెక్టరుగారూ! ఆమెను దోడ్కొనిరండు.

ఇన్స్పెక్టరు గదివీడి వెడలిపోయెను. రాయలు జయంతశ్రీ క్షితీంద్రనాథుల ప్రయాణమును గురించిన వివరములు ప్రశ్నించి వారు పొందిన

అసౌకర్యములను శ్రీమను దెలిసికొనసాగెను. వారికి రైలులోఁ బండుకొనుటకుఁ జాలినంత స్థలముదొఱకెను. కాఁబట్టి రాత్రి ప్రయాణమువలన వారు లేశము నిబ్బందిపడలేదు.

ఫణినాథుఁడు తాను వ్రాసిన కాగితములవంకఁ దేటిపాఱఁజూడ సాగెను. దేవేంద్రవిజయుఁడు గోడకుఁ జేరగిలఁబడి నిద్దురబోవుచున్నట్లుండెను

ఊర్మిళను వెంటఁబెట్టుకొని యిన్స్పెక్టరు తిరిగివచ్చెను. ఆమెవైఖరి భయపడినదానివలెను, స్వీయపక్షము సమర్థించుకొనుదానివలెను, అధికారులు మితిమీఱి తఱుమఁజూచునపుడు ఎదుర్కొనుటకుఁ బూనుకొను దానివలె నుండెను.

జయంతశ్రీ "అయ్యో! ఊర్మిళా!" యని ఏమియో చెప్పఁబోయెను. ఆమెను వెంటనే ఫణినాథుఁడు వారించెను.

"క్షమింపుఁడు. క్షమింపుఁడు నేను విచారణచేయుచున్నాను." అని అతఁడు ఊర్మిళవంకకుఁదిరిగి "అమ్మాయీ! ఊర్మిళా! నీవు భయపడవలదు. నిన్ను ఒకటిరెండు ప్రశ్నములడుగఁదలచితిని. నిన్న శ్రీ తుషారకాంత రాయలవారు జయంతశ్రీదేవిగారికి బహుమానముగా నొసంగిన పచ్చల పతకమును నీతోఁగూడ అలహాబాదునగరమునకుఁ దీసికొనివచ్చినావా?" యని ప్రశ్నించెను.

ఊర్మిళ:- నేనా? లేదు. నేనాపచ్చలపతకమును దీసికొనిరాలేదు.

ఫణి:— నిశ్చయముగానా?

ఊర్మిళ:- నిశ్చయముగానే! నేనాపతకమును నింతవఱకును జూడనేలేదు. నిన్న దానిని జయంతశ్రీదేవి అలమారపైఁ బెట్టెనుగదా?

ఫణి:— అది నీకెట్లు తెలియును?

ఊర్మిళ:- అది అక్కడనున్నదని జయంతశ్రీ చెప్పుచుండఁగా వినియుంటిని. ఒకవేళ సుమబాల తనసంచిలోఁ బడవైచికొన్నదేమో యనుకొంటిని.

రాయలు:- సుమబాల తనసంచిలో నెందులకుఁ బడవైచుకొనును?

ఊర్మిళ:- జయంతశ్రీదేవికొఱకు అలహాబాదు తీసికొనివచ్చుటకు.

దేవేంద్రవిజయుఁ డాకస్మికముగ జోక్యము కలుగఁజేసికొని "నీవట్లు భావించుటకుఁ గలకారణమేమి?" యని ప్రశ్నించెను.

ఊర్మిళ:- సుమబాల దానిని తనసంచిలోఁ బెట్టుకొనినదని యెందులకు భావించితిననగా ఆమె అలమారకుఁ బ్రక్కగా నిలువఁబడియుండగాఁ

జూచితిని.

ఫణి :- ఓహో ! ఆపతకము అలమారమీఁద నుండెనా ?

ఊర్మిళ :- అవును.

నిశ్శబ్దము మంతాట నావరించెను. ఆకస్మికముగ నాగదిలోని వాతావరణ మంతయు మాఱిపోయినట్లు గోచరించెను. ఏదో తెలియరాని యిదమిత్థమని నిర్ణయింప వలనుపడని యొకానొక భయభ్రాంతి నందఱి నావేశించినట్లు తోఁచెను. దేవేంద్రవిజయుఁడు అప్రమత్తుఁడై సహస్రాక్షునివలె సంచరింపఁ దొడఁగెను.

ఫణి :- జయంతశ్రీ దేవిగారికడ నెంతకాలమునుండి బని చేయుచున్నావు ?

ఊర్మిళ :- ఆరుమాసములనుండి.

ఫణి :- మంచిది. ఇఁక నీవు పోవచ్చును.

ఊర్మిళ బ్రతుకుజీవుఁడాయని తెంచుకొని పాఱిపోయినట్లాగదిఁ వీడి చెంగున దాటిపోయెను. ఫణినాథుఁడు కాగితములపైఁ గొన్ని వాక్యములు వ్రాసికొనియెను. తరువాత నాతఁడు "నేను సుమబాలను విచారించవలయును" అనియెను.

రాయలు:- సుమబాల విషయమై ఏమియును శంకింపవలసిన అవసరములేదు.

జయంతశ్రీ:- అవును. యథార్థముగా నామె ననుమానించుటకు వీలులేదు.

దేవేంద్ర:- సుమబాల యెంతకాలమునుండి మీకొలువులో నున్నది ?

"జ్ఞాపకము చేసికొనుచున్నాను." అని జయంతశ్రీ భ్రూలతలు ముడివైచి యాలోచించుకొనుచు లెక్కపెట్టసాగెను.

ఫణి:- నీకు జ్ఞాపకములేదా ?

జయంతశ్రీ:-షుమారు మూఁడు సంవత్సరములనుండి.

ఫణి :- అవును. అనగా దొంగతనము ప్రారంభమైన కాలమునుండి యించుమించుగా.

జయంతశ్రీ:-అవును. అని ఆమె ఇష్టములేనిదానివలె సమాధాన మొసంగెను.

ఫణి:- ఇన్స్పెక్టరుగారూ! సుమబాల నిచటికిఁ దీసికొనిరండు.

ఇన్స్పెక్టరు :- చిత్తము.

రాయలు వెంటనే లేచి ద్వారము చేరఁబోవుచు "నేనామెను బిలచికొని వచ్చెదను. ఆమె యెక్కడనుండునో నాకుఁ దెలియును" అనియెను.

దేవేంద్ర:- ప్రభూ ! క్షమింపుఁడు. ఇన్స్పెక్టరుపోయి ఆమెను గొనివచ్చును.

రాయలు చటుక్కున వెనుదిరిగి దేవేంద్రునివంకఁ జూచెను.

"దయచేసి- మీ అభిప్రాయము- ?"

దేవేంద్ర:- ప్రభూ ! మీరు కోపగింపవలదు. విచారణ సమయములలో నది శాసనమునకు విరుద్ధము కాఁగలదు.

ఫణి:-అవును. ప్రభూ! అవును. శాసనముప్రకారము మేమవలంబింపవలసిన పద్ధతులున్నవి. వాని ఆచరణవిధానములలో మార్పు లుండఁగూడదు. వాని నారీతిగానే పాలించుట మేలు.

రాయలు:-సరియే ! మీయిష్టప్రకారమే కానిండు.

ఇన్స్పెక్టరు తిరిగివచ్చి యిట్లు నివేదించెను. "సుమబాల యిచటికి నిమేషకాలములో రాఁగలదు. ఆమె యిపుడే వెలుపలికిఁ బోవుచుండెను."

ఫణి :- ఆమె వెలుపలికిఁ బోవుచున్నదా? అట్లయిన మీరింటిలోవారిని వెలుపలికి వదలిపెట్టుచున్నారన్నమాట—

ఇన్స్పెక్టరు :- లేదు. వెలుపలికిఁ బోవుటకు వీలగునాయని ఆమె యిప్పుడే అడుగుచున్నది.

ఫణీనాథుఁడు ఇన్స్పెక్టరును దగ్గఱకు రమ్మని చేతతోఁబిలిచి తక్కిన వారి కెవ్వరికిని వినఁబడనంతటి హీనస్వరముతో నిట్లు చెప్పెను.

"నీవు ఆమెగదిలోనికి రహస్యముగ బోయి ఆమె పెట్టెలన్నింటిని వెదుకవలయును"

ప్రక్కనే యున్న దేవేంద్రవిజయుఁడు దీనస్వరముతో ఖండితముగా నిట్లు చెప్పెను.

"అట్టిశ్రమ తీసికొనవలసిన అవసరములేదు."

ఫణి:-మంచిది. అట్టిశ్రమతో పనిలేదు. అని దేవేంద్రవిజయుని వాక్కులనే దృఢపఱచె .

ద్వారము తెఱచుకొని సుమబాల లోనికిఁ బ్రవేశించెను. ఆమె యింతకును ప్రయాణము చేసిన దుస్తులనే యుండెను. ఆశ్చర్యముతో నామె యందఱి వంక నొకసారి కలయఁదిరిగి చూచెను. రాయలామెవంక తీక్ష్ణవీక్షణములను బ్రసారించుచు నామెను పరీక్షించుచుండెను. ఆమెయొకసారి రాయలవంకఁ జూచి తలవాల్చి నేలపైఁ దన దృష్టులను బఱపసాగెను.

ఫణి:- అమ్మాయీ ! నీవు కొంచెము ముందునకు రాఁగలవా? ఒకటి రెండు ప్రశ్నము లడుగవలసి యున్నది.

దేవేంద్రవిజయుఁడు నమ్రభావముతో ముందునకువచ్చి "నాకు అనుమతి నొసంగెదరా?" యని విధేయుఁడై ఫణినాథుని వేడుకొనియెను. అతని

వినయభావసంపత్తినిజూచి ఫణినాథుఁడు కాదనజాలకపోయెను. దేవేంద్రవిజయుఁ డంతట సస్మితవదనుఁడై "సుమబాలా! ఫణినాథమహాశయులు నిన్నొక విషయమునుగుఱించి తెలిసికొనఁ గోరుచున్నాడు. నిన్నటిరాత్రి శ్రీకుసుమాకర కాంతరాయలు జయంతిశ్రీ దేవిగారికి బహూకరించిన పచ్చలపతకము దొంగిలింపఁబడినది." అని పలికెను.

సుమబాల :- దొంగిలింపబడినదా ? ఇది నిజమా ?

ఆమె కంఠస్వరములో నత్యంతమగు నాశ్చర్యమును ఆతురతయును వ్యక్తమయ్యెను.

దేవేంద్ర:- ఇది ముమ్మాటికిని నిజము. ఎట్టి పరిస్థితులలో దొంగతనము జరిగినదో మేము నిర్ధారణ చేసికొంటిమి. కాని ఆపని చేసిన వ్యక్తి పట్టుపడకుండఁ దప్పించుకొనుటకై యాపతకమును మఱియొకరి ప్రియాణపు సంచిలోగాని పెట్టెలోగాని పడవైచియుండునని మేము దృఢముగా విశ్వసించుటకు సహితము కారణములు గలవు.

సుమ:- నాసంచి మేడమీఁది నాపడకగదిలో నున్నది. ఇదిగో దానిబీగము.

తన చేతిలోనున్న చిన్న సంచిలోనుండి బీగమును దీసియిచ్చుటకై ఆమె యింతకుముందు పట్టుకొనియున్న ఉన్ని అంగరఖాను ప్రక్కనున్న సోఫా వెనుకభాగమునకుఁ దగిలించెను. కాని అదిజారి రాయల కాళ్లచెంత క్రిందఁబడిపోయెను. ఆమె సంచిలోనికిఁ జేయిదూర్చి తాళపుఁ జేయికొఱకు వెదకుచుండగా నందఱు నామెవంకనే తదేకధ్యానముతోఁ జూచుచున్నపుడు సుమబాల మనస్థితిని గమనించుచున్న రాయలు నిమ్మళముగా వంగి యాయున్ని అంగరఖాను పైకి లేవనెత్తి దాని జేబులోనికిఁ దన చేతినిజొనిపి యందులోఁ గాగితము జుట్టియున్న యొక గట్టివస్తువును గుప్పిటలోనికిఁ దీసికొని అంగరఖా మఱుగున దానిని దనజేబులోఁ బడవైచుకొనెను. మఱల నాతఁడా యంగరఖాను యథాప్రకారముగ సోఫాకుఁ దగిలించి నెమ్మదిగాఁబోయి జయంతిశ్రీ ప్రక్కన చూరుచుండెను. అతఁడు చేసిన యీపని నెవ్వరును జూడలేదు. దేవేంద్రవిజయుఁడు సైతము గమనింపలేకపోయెను. దేవేంద్రుని దృష్టియంతయు సుమబాలమీఁదనే యుండెను.

సుమబాలకుఁ దాళపుజేయి దొఱకెను. దానినామె దేవేంద్రవిజయున కిచ్చెను. అతఁడు తల నడ్డముగాఁ ద్రిప్పుచు 'నీసంచిని వెదుకవలసిన యవసరములేదు. నీపెట్టె లెక్కడ నున్నవి? "అని యడిగెను.

దేవేంద్రవిజయుని నిశితవీక్షణములకు సుమబాల వెనుకంజవైచెను.

సుమబాల:- నాట్రింకుపెట్టె - మేడమీఁద నాపడకగదిలో - తెఱచియే యున్నది.

ఆమె మాటలలో దడబాటు లొదవెను. ఆమె నయనయుగ్మకము భీతిని సూచించెను. దేవేంద్రవిజయుఁడు మృదులస్వరముతో

"నీవు నగరములోనికిఁ బోవుచున్నావా?" యని ప్రశ్నించెను.

సుమబాల:- నేను పోవుట కనుజ్ఞ వేఁడుకొనుచుంటిని. బజారునుండి కొన్ని వస్తువులు కొని తేవలసియున్నవి."

దేవేంద్ర:- ఫణినాథమహాశయా? సుమబాల యీభవనమువీడి బజారుపోవుటకు మీకే యాక్షేపణమును లేదనుకొందును. నిజమేనా ?

ఫణి:— నాకాక్షేపణ మేమియును లేదు. ఆమె స్వేచ్ఛగా వెడలిపోవచ్చును.

సుమబాల వెడలిపో నుద్యుక్తురాలయ్యెను. దేవేంద్రవిజయుఁడు ముందునకువచ్చి "ఒక్కని మేమమాఁగవలయును. నీదగ్గఱనున్న యీచేతిసంచి యొక్కటియేనా?" యని ప్రశ్నించెను.

సుమబాల:- అవును. దానిలో నాచేతిరుమాలయుఁ గొంతసైకమును గలదు.

అనుచు నామె యాసంచిని దేవేంద్రున కందిచ్చెను. అతనిద్దుక్కులు సంచిలోనికిఁ జొచ్చుకొనిపోయెను.

దేవేంద్ర:- దానిని జూడవలసినపని లేదు. అంతధైర్య మెవరికేనియుండునని నే ననుకొనను.

సుమబాల ద్వారముకేసి రెండడుగులువైచి, వెనుకకుదిరిగి కొంచె మాఁగి సోఫాకడకువచ్చి దానికిఁ దగిలించి యున్న యంగరఖాను దీసికొనియెను.

దేవేంద్రవిజయుని కన్నులు విజయోత్సాహములతో మిలమిల మెఱచిపోయెను. అతఁ డామెను డాసి యంగరఖాను దీసికొనుటకుఁ జేతినిజాపుచు "దాని నిటు నాకిమ్ము." అనియెను.

సుమబాల:- నాకు మీసహాయ మక్కఱలేదు.

దేవేంద్ర:- అదికాదు. దానిజేబులో నేవైనవస్తువులుఁగలవేమో చూచితివా? ఎవరైనను బడవేయుట సాధ్యమైనవిషయమే - అదిగో! ఆజేబు చూపుము. దానిలో నేదియోయున్నట్లు గన్పడుచున్నది.

అనుచు దేవేంద్రవిజయుఁడు ఇంతకుఁబూర్వము కాగితముతోఁ జుట్టిన వస్తువుండిన జేబును జూపించెను. సుమబాల వివశురాలై వడఁకుచు నిర్ఘాంతపోయెను. తప్పించుకొనుటకు దారిదొఱకునేమోయని వెదకుచున్నటు లామె

గ్రలతో నలువైపులను జూడసాగెను. అప్రియత్నముగా నామె
ంఖా జేబును తన చేతులతో మూసివైచెను.

గొల:- ఇది చాలదురాగతముగాఁ గనబడుచున్నది. మీధోరణిచూడఁగా-
ఎద్రి:- నీవు కోపగించుకొనవలదు. నేను వేడుకొనుచున్నాను. కొన్ని
సమయములలో మేము విధిగాఁ గష్టముకలిగించవచ్చును.

రాయ లప్పుడు లేచి స్ఫుటమైన శాంతస్వరముతో "సుమబాలా! కోమపరిశారము జరుగవలసిన యీస్వల్పవిధికి నీవేల యభ్యంతరముకలిగించు చున్నావో నా కర్థమగుట లేదు." అనియెను.

సుమబాల:- "అవును. నిజమే; కాని-కాని." యని యామె భీతవిస్ఫారిత
నయనములతో నాతనివంకఁ జూచెను.

రాయ లామెచూపుల నెదుర్కొనియెను. ఆతఁ డట్టిశాంతస్వరము తోడనే "నీవు భయపడవలసిన యవసర మావంతేనియు లేదు." యని సమాశ్వాసించెను.

సుమబాల అంగరఖాను వదలివైచెను. దేవేంద్రవిజయుఁడు విజయ ప్రమోదమును సూచించు ముఖవైఖరితో దానిజేబులోనికిఁ జేతిని దూర్చెను. అది శూన్యమై యుండెను. నమ్మజాలక దానిని బైటికిలాగిచూచెను. ఆతఁడు పడినశ్రమయంతయును వృథాఅయ్యెను. హతాశుఁడైన యాతని మొగము వెలవెల బోయెను.

ఆతఁడతి ప్రయత్నమున లేనిచిఱునవ్వు తెచ్చుకొని "సుమబాలా! క్షమింపవలయును." అని ఆమె యంగరఖాను తిరిగి యిచ్చివైచెను. ఆమె దానిని దీసికొని వెడలిపోవుటకు వెనుదిరిగెను. రెండడుగులు నడచి యామె సోలిపోఁదొడఁగెను. రాయలు ముందునకురికి వెంటనే యామెను బడకుండఁ బట్టుకొనియెను.

"నీకు కోప వచ్చుచున్నదా?" అని యామెను మిగుల నాతురతతోఁ బ్రేమపూర్వకముగఁ బ్రశ్నించెను.

"మీకు నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు. మీరు నన్ను సకాలమునకు రక్షించినారు" అనియామె నెమ్మదిగాఁ బలికెను.

"నేను చాలగ విచారించుచున్నాను. క్షమింపవలయును." అని దేవేం
ద్రుఁ డనియెను.

"మ రేమియునులేదు. నాకిపుడు స్వస్థత కలిగినది. మీరు విచారింప వలదు." అని సుమబాల పలుకుచు నాగదివీడి వెడలిపోయెను.

దేవేంద్రవిజయుఁడు ఫణినాథమహాశయుని జూచెను. ఫణిన తనిజూచి "దేవేంద్రవిజయా! నీవు చాలపొరబాటుపని చేసినావు" అనెను.

దేవేంద్రవిజయుఁడాతని మాటలను లక్ష్యపెట్టలేదు. అతఁడు వినినట్లునటించి హీనస్వరముతో "మహాశయా? నాయనుజ్ఞలేనిదే యెవ్వ ఈభవనమువిడచి వెలుపలికిఁ బోవఁగూడదని యుత్తరువులొసంగుడు." వేఁడుకొనియెను.

ఫణి:- ఒకసుమబాలమినహా-అంతియేనా ?

దేవేంద్ర:- ఆమెయే ముఖ్యముగాఁ బోఁగూడదు.

ఫణి:- నీచర్యయేమియు నా కర్థమగుట లేదు. సుమబాల దండధరుని మాఱు వేషమనియా నీయభిప్రాయము? దేవేంద్రవిజయుఁడు నవ్వెను. "మహాశయా ! మీకే అర్థముకాగలదు." అనియెను.

ఫణి:- మంచిది. అట్లే యుత్తరువులొసంగెదను.

అతఁడు ఇన్స్పెక్టరునుబిలచి యాతనిచెవిలో నేమియోచెప్పెను. తరువాత నాతఁడులేచి "మనము పడకగదులను బరీక్షింపవలసియున్నది. అంత కన్న ముఖ్యమైనవిషయము - క్షితీంద్రనాథునిగదిలో నున్నయినుపపెట్టె చోరులవశము గాలేదని స్థిరపఱచుకొనవలయును.

క్షితీంద్రనాథుఁ డోపికపట్టఁజాలకపోయెను. అతఁడు లేచిపోవుచు "ఈపతకమును గురించి మాటలాడుచు నెంతకాలము దుర్వినియోగము చేసెదరు? లెండి. పోవుదము" అనియెను.

ఫణి:- పడకగదులలోఁ గొన్నినగలపెట్టెలుకూడ నుండవచ్చును.

జయంతశ్రీ:- అవన్నియు వివాహమునకు వచ్చినబహుమతులు. రాజామాయి స్వాధీనములో నున్నవి. అవి దొంగిలింపఁబడినచో నాగుండెలు వ్రయ్యలైపోఁగలవు. వానిలో గొన్ని గొప్పజమీందారు లొసంగినవి.

జయంతశ్రీ క్షితీంద్రనాథుఁలు గలసి దారితీసిరి. ఫణినాథుఁడు, దేవేంద్రవిజయుఁడు, ఇన్స్పెక్టరు వారిని వెంబడించిరి. ద్వారమునొద్ద రాయలు కొంచెమునిదానించి నిలిచిపోయి తలుపులు మూసివైచెను.

అతఁడు గవాక్షమును సమీపించి జేబులోనికిఁ జేతినిజొనిపి కాగిత ములోఁ జుట్టియున్న వస్తువును బైటికి తీసెను. ఆకాగితము మడతలు విప్పి నెమ్మదిగా తెఱచిమాచెను. అది పచ్చలపతకము.

ప్రియ పాఠకమహాశయులారా ! ఈకథ ప్రథమభాగ మింతటితో సమాప్తమైనది. దండధరుఁడింకను రంగముపైకి రాలేదని మీరింతవఱకు భావించుచుందురు. కాని ప్రారంభమునుండియు నాతఁడు ప్రముఖపాత్రను నిర్వహించుచునే యున్నాఁడు. అతఁడెవఁడై యుండనోపునో మీరూహింపఁ గలరా? ఊహింపలేనిచో ద్వితీయ భాగమును జూడుఁడు.